## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014




రచన:

హరి ఆదిశేషువు

ప్రకాశకులు:

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

గాంధి జ్ఞాన మందిరం, సుల్తాన్ బజార్

హైదరాబాద్ - 500 001

# పాఠకులకు మనవి

సర్వోదయ సాధన మన లక్ష్యము, ధ్యేయము, అందుచేత సమాజాన్ని దానికి అనుగుణంగా రూపొందించుకొనడము అవసరము. ఆచరణ యోగ్యాలూ సాధ్యాలూ అయిన సూచనలు ఋషితుల్యులైన టాల్‌స్టాయ్ (Tolstoy), మహాత్మాగాంధీ, వినోబాజీల రచనల్లో విరివిగా కన్పిస్తాయి. వాటిలోని రత్నాల్ని యథాశక్తిగా లోకానికి చూపడం కూడా మన లక్ష్య సాధనకు కొంత తోడ్పడుతుంది. ఆ దృష్టితోనే టాల్‌స్టాయ్ రచించిన ఐవాన్, ది ఫూల్ (Ivan, The Fool) అనే కల్పిత కథను తన వాతావరణానికి అనుగుణమైన చేర్పులూ మార్పులూ చేసి పాఠకులకు అందిస్తున్నాను.

గాంధేయసూత్రాల్ని వినోదాత్మకమైన కథారూపంలో పిన్న వయసువారికి అందించే లక్ష్యమే ఈ రచనకు ప్రోత్సాహాన్ని ఇచ్చింది. అది ఎంతవరకు కొనసాగిందో గుణగ్రహణపారీణులైన పాఠకులే నిర్ణయించాలి.

హరి ఆదిశేషువు

# అంకితము

ఓ భారతస్వాతంత్ర్య సమరయోధాగ్రిణీ
ముష్టి లక్ష్మీనారాయణగారూ !

ఈ పుస్తకం సైజులో చిన్నది
కాని, విషయ గౌరవంలో ఎంతో పెద్దది
దీన్ని అంకితం తీసుకోతగినవాడు
'ఫోనిక్స్' క్షేత్రంలోని హలధరుడు -
పూజ్య బాపూజీ.

అయితే ఇది తెలుగురచన
తెలుగు హలధరుడికే అంకితం కావాలి
అని నా భావన. ప్రగాఢమైన వాంఛ.

ఆ దృక్పథంతో వెతకగా వెతకగా నా భావాంబర వీధిలో
తటుక్కున మీరు మెరుపులా కనిపించారు....
బి.ఏ., బి.ఎల్. పట్టాలను తోసిపుచ్చి
హాలికుడనని గర్వంగా చెప్పుకొన్న హలధరులు.

మీ సరసనే, ఇంజనీరింగు పట్టా దాచిపెట్టి
పార ధరించి పనులుచేసి తోటలు పెంచి
ఈ నాడు కనుమరుగైన మీ తమ్ముడు సుబ్రహ్మణ్యం -
మరొక హలధరుడు
ఈ దృశ్యం ఈ నాటిదికాదు
అరవై ఏండ్లనాటినుంచి పులకరింపజేస్తున్నది.

సోదర వాత్సల్యానికి మీరు ఒరవడి
జ్యేష్ఠత్వమూ శ్రేష్ఠత్వమూ మీ వాటా
రాచరికరపు లాయరుగిరీకంటె
మీ మనసు హాలికజీవనంపైపే మొగ్గింది.

అందుచేతనే ఈ సాలధరుడు, మీ దాడు
హలధరుని విజయం మీ విజయం
హలధరుడి మిమ్మల్ని
మీలో హలధరుడినీ నేను ప్రత్యక్షం చేసుకొన్నాను
అందుచేతనే అందుకొమ్మంటున్నాను.

ఈ కృతిని
దీవించండి నన్ను మీ సహజవాత్సల్యంతో

హ రి ఆ ది శే షు వు

# ప్రకాశకుల నివేదన

గాంధీ సాహిత్య ప్రచురణాలయ 116 వ ప్రచురణగా "రైతు రాజు" అనే ఈ పుస్తకాన్ని పాఠకలోకానికి సమర్పించగలిగినందుకు సంతోషిస్తున్నాము. ఆధునిక అహింసాసిద్ధాంత ప్రవక్త అనదగిన టాల్‌స్టాయ్ రచించిన "ఐవాన్ ది ఫూల్" అనే కథకు ఇది అనుసరణ. స్వర్గీయ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఈ పుస్తకాన్ని "మూర్ఖరాజు" అను పేర అనువాదంచేసి దాదాపు అరవై సంవత్సరాలైనది. ఇప్పుడా ప్రతులు గూడా లభించవు.

శ్రీ హరి ఆదిశేషువు టాల్‌స్టాయ్ రచనలతో స్ఫూర్తిని పొంది అహింస యెడ విశ్వాసాన్ని పెంచుకున్నారు. 1940–41 ప్రాంతంలో రెండవ ప్రపంచ మహాయుద్ధం జరుగుతున్నప్పుడు ఆంధ్ర తీర పట్టణాలపై జపాను బాంబు వేస్తుందనే భీతి వ్యాపించినప్పుడు యుద్ధాన్ని అహింస ద్వారా ఆపగలమనే ఇతివృత్తం గల ఈ కథను వీరు చదివి మన దేశానికి అనుగుణ్యమైన రీతిలో రచించారు. తరువాత చాలా కాలానికి 'పంచాయతీ రాజ్యం' అనే మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించారు. ఇప్పుడు పుస్తకరూపంలో ప్రచురించుటకు గాంధీ సాహిత్య ప్రచురణాలయానికి శ్రీ ఆదిశేషువుగారు అనుమతినిచ్చారు. వారికి మేమెంతయు కృతజ్ఞులము.

ఇతివృత్తము కేవలం ఊహాజనితంగా కనిపించినా, అహింసా సిద్ధాంతాన్ని చాలా గంభీరంగా ప్రతిపాదిస్తుంది. ఈ సాహిత్య ప్రచురణాలయం గాంధీ సిద్ధాంతాన్ని ప్రబోధించే కాల్పనిక సాహిత్యాన్ని అంతగా ఇదివరకు ప్రచురించలేదు. ఇప్పటినుండి సంవత్సరానికొక

కాల్పనిక రచనన్తైనా ప్రచురించవలెననే సంపాదక సమితి సంకల్పానికి తొలి కార్యరూపమిది. రచయితలు ఇట్టి రచనలను ఇతోధికంగా మాతో ప్రచురింపచేయగలరని ఆశిస్తున్నాము.

ముద్రాపకులు శ్రీ లలితా ప్రింటింగు మరియు బైండింగువారికి, మా యీ ప్రచురణకు పరోక్షంగా తోడ్పడిన ఇతర మిత్రులకు మా కృతజ్ఞత.

ఇట్లు

గాంధీ జ్ఞాన మందిరం
సుల్తాన్ బజార్
హైదరాబాద్ - 1
తేదీ 10-3-1981

కోదాటి నారాయణరావు
కార్యదర్శి
గాంధీ సాహిత్య ప్రచురణాలయం

# విషయసూచిక

# 1. అన్నదమ్ములు

అనగా అనగా ఒక దేశం. ఆ దేశంలో ఒక రాజ్యం. ఆ రాజ్యంలో ఒక ఊరు. ఆ ఊరిలో ఒక రైతు. ఆ రైతుకి ముగురు కొడుకులు; ఒక కూతురు. అతను ముచ్చటపడి తన కొడుకుల్ని జయశీలుడు, ధనశీలుడు, హలధరుడు అని పిలిచేవాడు. కూతురు మాధవి. పాపం, పుట్టుకతోనే మూగదీ, చెవిటిదీ అయింది. అందుచేత ఒక్కనాడూ పల్లెత్తి మాట్లాడి ఎరుగదు. ఒకరిచేత ఏదీ చెప్పించుకొనేదికాదు. ఆమె స్వయంగా ఊహాపోహలు కలది. ఎంతో పనిమంతురాలు. అయినా ఆమెను పెండ్లి చేసుకొనేటందుకు ఎవరూ ముందుకు రాలేదు. అందుచేత ఆమె కన్యగానే ఉండిపోయింది. ఇంటి పనులూ, వంటపనులూ తన చేతిమీదుగానే చేసేది. తల్లికి చేదోడుగా వాదోడుగా ఉండేది.

జయశీలుడు పేరుకు తగినట్లు పెరిగాడు. చదువు పూర్తి కాగానే సైన్యంలో చేరాడు. ధనశీలుడు కూడా అట్లాగే ఎదిగాడు. చదువుకొని వ్యాపారం చేసేటందుకు పూనుకొన్నాడు. అందుచేత అతను పట్నంలో మకాము వేసాడు. హలధరుడు అమాయకుడు. ఊరిలో ఉన్న చదువు చదివాడు. ఊరు దాటి బైటి చదువులకు పోలేదు. వ్యవసాయం చేస్తూ న్నాడు. ముసలి తల్లితండ్రుల్ని, చెల్లెల్ని చూసుకొంటూ ఉన్నాడు.

జయశీలుడు క్రమక్రమంగా ఉన్నతాధికారి అయ్యాడు. రాజుగారి మెప్పు పొందాడు. ఎన్నో పతకాలూ, జాగీర్లూ బహుమానంగా అందు కొన్నాడు. తన హోదాకు తగినట్లు మరొక జాగీరుదారు కూతుర్ని పెళ్ళి

చేసుకున్నాడు. ఆమె ఎంతో ఖర్చు మనిషి. జయశీలుడి జీతం ఎక్కువే. కాని, ఆమె చేసే డాంబికపు ఖర్చులు అంతకంటె ఎక్కువ. అందుచేత జాగీరుమీద రాబడీ, జీతమూ కలిసి ఖర్చు అయేవి. మిగలడము అనేదే లేదు. "ఎంత కొంచెం వచ్చినా వచ్చినట్లే. తండ్రికి నా గోడు చెప్పు కొంటాను. పిత్రార్జితంలోనుంచి నా వాటా నేను తెచ్చుకొంటాను" అని జయశీలుడు అనుకొన్నాడు. ఆ నిశ్చయంతో, చాలా కాలం తర్వాత మళ్ళీ, తన ఊరికి వెళ్ళాడు. భోజనమైన తర్వాత తండ్రితో తన మనసు లోని మాట చెప్పాడు. తండ్రికి ఆశ్చర్యమూ, విసుగూ కలిగాయి. "ఆదేమిట్రా! నీకింకా ఆస్తిలో వాటా కావాలా? ఎక్కడినుంచి తెచ్చి ఇవ్వమంటావు? నీవు చదువుకున్నావు. సైన్యంలో చేరి శిక్షణ పొందావు. అప్పుడు చేసిన ఖర్చులు ఎక్కడినుంచి తెచ్చి ఇచ్చాననుకుంటున్నావు? మన పొలాలమీద వచ్చిన పంటలో మూడు వంతులు నీ చదువులకూ, దర్జాలకూ ఖర్చు అయింది. పోనీ, ఇన్నాళ్ళుగా సంపాదిస్తున్నావు కదా. 'ఇదిగో నాన్నా! ఈ కాస్త సొమ్ము తీసుకో. వ్యవసాయపు పెట్టుబడికి వాడుకో.' అని ఇచ్చావా? నిన్ను ఏమైనా ఇమ్మని నేనెప్పుడైనా అడిగానా? ఇక్కడ మాకు ఉన్న ఆధారం ఈ భూములే. మేము మా రెక్కల్లోని సత్తువనే నమ్ముకున్నాము. ఈ భూమాతనే సేవిస్తున్నాము. ఆమె ప్రసాదాన్నే కడుపారా తింటున్నాము. నీవూ, మీ ఆవిడా కూడా మాతోపాటే ఉంటామంటే నాకేమీ అభ్యంతరం లేదు." అన్నాడు.

జయశీలుడికి తండ్రి మాటలు నచ్చలేదు. "ఇంత చదువూ చదువుకున్నది ఎందుకు? మట్టి పిసుక్కోడానికా! మేము ఇక్కడ ఉండటం కుదరదు. న్యాయంగా తండ్రి తాతల ఆస్తిలో నా వాటా నాకు ఇయ్యి. ఇక నా దారి నాదీ, మీ దారి మీదీ. కాదంటావా ఊరిలో పెద్దలున్నారు. న్యాయస్థానాలు ఉన్నాయి." అని విరోధగమాటంగా అన్నాడు.

"అంతేకాదు. మంచీచెడ్డా, మనస్సాక్షీ ఉంటాయి. ఇన్నేళ్ళ మంచీ చెమటోడ్చి పంట పండిస్తున్నవాడు మీ చిన్న తమ్ముడు. ఇంటి పనులతో రెక్కలు ముక్కలు చేసుకొని పాటుపడుతూ రోజులు వెళ్ళ బుచ్చుకొంటున్న అవిటిది మీ చెల్లెలు. ఏది ఏలాగైనా సరే. నేను మాత్రం నా చేతులారా వారికి అన్యాయం చెయ్యలేను." అని అతని ముసలి తండ్రి నిష్కర్షగా జాలి కలిగేలా అన్నాడు.

"ఆ ఇద్దరికీ వాళ్ళ వాటాలు వాళ్ళకి చాలవా ? నాది కూడా వాళ్ళకి కట్టబెట్టాలని నీవు ఎందుకు అనుకొంటున్నావు ?" అన్నాడు జయశీలుడు.

అప్పుడు హాలధరుడు కలగజేసుకొని "పోనీలే, నాన్నా ! అన్నయ్య వాటా అన్నయ్యని తీసుకోమను. మిగిలిందే మనకు చాలు." అన్నాడు.

వ్యవహారం ఎంతో సులువుగా తేలిపోయినందుకు జయశీలుడు సంతోషించాడు. వెంటనే హాలధరుడిని ఊరిలో వ్యవహర్తల దగ్గరకు తీసుకొనివెళ్ళాడు. తన వాటాకు ధర నిర్ణయం చేయించుకొన్నాడు. వ్యవహర్తలు దూరపు చూపు కలవారు. వారి దృష్టి పూర్తిగా హాలధరుడి ఆస్తిమీద పడింది. ముందుముందుగా దాన్ని పూర్తిగా కబళించాలని వారి ఆశ. అందుచేత అన్నగారి వాటా భూమిని కొనుక్కోమని వారు హాలధరుణ్ణి ప్రోత్సహించారు. కావాలంటే సరసమైన వడ్డీకి కావలసిన సొమ్ము అప్పుగా ఇస్తామన్నారు. పంట రాగానే ఇస్తే ఆ అప్పు తీరిపోతుంది అన్నారు. హాలధరుడు ఈ వ్యవహారపు తికమకలేవీ పట్టించుకోలేదు. 'సరే' అన్నాడు. దైవం రక్షించి పంట బాగా పండితే ఎవరికీ ఏ లోటూ ఉండదు. తమ పొలం తమ చేతుల్లోనే ఉంది. పెద్దన్న జయశీలుడు తృప్తి చెందాడు. తనకి కావలసింది అంతే.

జయశీలుడు తన వాటా భూమిని అమ్మినట్లు రాతకోతలు ముగించు కొన్నాడు. సొమ్ము జేబులో వేసుకున్నాడు. తిరిగి తన మిలిటరీ ఉద్యోగానికి వెళ్ళిపోయాడు.

ధనశీలుణ్ణి వ్యాపారంలో అదృష్టం వరించింది. లక్షలకు అధిపతి అయాడు. మరొక లక్షాధికారి కూతురిని పెళ్ళి చేసుకొన్నాడు. ఆమె కూడా బాగా సారెచీరలు, ధనకనక వస్తువాహనాలూ అరణంగా తెచ్చు కున్నది. ఐనా, ధనశీలుడికి తృప్తి కలగలేదు. తన ధనాన్ని ఏ రీతిగా పెంచడం ? దొంగలపాలు కాకుండా సంరక్షించుకోవడం ఎట్లా? అనే సమస్యల గురించి అతను ప్రతి క్షణమూ ఆలోచిస్తూ ఉండేవాడు.

ధనశీలుడు తన అన్న పూర్వుల ఆస్తిలో వాటా పుచ్చుకొన్నట్లు విన్నాడు. జాగీరుదారైన అతనికే తండ్రి వాటా ఇచ్చేసాడు. అందుచేత తన వాటా కూడా తనకు ఇవ్వడం న్యాయం. అడగందే అమ్మ అయినా పెట్టదు. కనక ఒకసారి వెళ్ళి తను కూడా తనకు రావలసింది తెచ్చుకోవాలి అని ధనశీలుడు నిశ్చయించుకొన్నాడు. తండ్రి దగ్గరకు వెళ్ళి కుశల ప్రశ్నలు వేసాడు. తర్వాత తన వాటా ఆస్తి తన కిమ్మని అడిగాడు. తండ్రికి, ధనశీలుడి కోరిక కూడా సబబుగా కనిపించలేదు. "నీ చదువులకీ, వాటి తర్వాత వ్యాపారంలో తరిఫీదు ఇప్పించేటందుకూ ఎంతో సొమ్ము ఖర్చు తయింది. ఇంకా నీకు ఎక్కడినుంచి వాటా ఇమ్మంటావు ? నీవు రెండు చేతులా సంపాదిస్తున్నావు కదా! ఇన్ని సంవత్సరాలైంది. నీవు ఇక్కడికి ఒక్కసారైనా వచ్చావా ? పోనీ మీరు వ్యవసాయానికి వాడుకోండి. అని కాస్తయినా మాకు ఆసరా అయ్యావా? వాటా పంచి పెట్టు అని ఈనాడు వచ్చి అడిగేటందుకు నీకు నోరెట్లా వచ్చింది?" అని కటుకుగా అన్నాడు.

ధనశీలుడు లౌక్యుడు. లాభనష్టాలు చూసుకున్నాడు. పొలం ఇచ్చినా తానేమీ చేసుకోలేడు. దాన్ని ఎవరికైనా అమ్మివేయవలసిందే. అన్నగారిమాదిరిగా కాకుండా మరోలా వ్యవహరించాలి. నష్టపడకూడదు. అని తనలో తాను చర్చించుకొని పైకి ఇట్లా అన్నాడు. "ఇన్నేళ్ళుగా మీరు పండించుకొని. పంట మీ ఇష్టం వచ్చినట్లు చేసుకొంటున్నారు' నేను కాదన్నానా? పట్నాల్లో ఏదైనా కొందామంటే కొరివీ, అమ్మదా మంటే అడివీలాగుంది. వ్యాపారం చెయ్యాలేను. మానివెయ్యాలేను. నా పని ఏమీ బాగాలేదు. పొలం మీదా ఇచ్చినా నేను పట్టుకొని వెళ్ళ లేను కదా! మరెవరికైనా దాన్ని అమ్మడం సదబూకాదు. అందుచేత ఈ ఏట పంటలో రెండువంతులు నాకు ఇయ్యండి. మిగిలింది మీకు చాలు తుంది. ఇంక నేను ఈ ఆస్తిమీదకు రాను. ఇంతే నేను కోరేది." హలధరుడు ఈ మాటలు విన్నాడు. పాపం తన చిన్న అన్నగారికి పట్నంలో తిండిగింజలు దొరకటంలేదు కాబోలు. కొనుక్కోలేక గిజగిజ లాడుతున్నాడు. అందుకే ఇట్లా నోరువిడిచి అడుగుతున్నాడు. పోనీ ఈ ఏడాది పంటలోనే కదా కొంత ఇమ్మని అడిగాడు. అతను తృప్తిపడితే చాలు. నాకు కూడా తృప్తి. మా నలుగురి పొట్టలకూ ఎన్నడూ లోటు కలగదు. అనుకొన్నాడు. వెంటనే ముసిముసి నవ్వులు నవ్వుతూ 'తీసుకో అన్నయ్యా. నీకు కావలసింది తీసుకో. మిగిలిందే మాకు చాలు. భూదేవి అనుగ్రహమే మాకు నిత్యపంట' అన్నాడు. ధనశీలుడు పంటను బండ్లకెక్కించి పట్నం తోలుకుపోయాడు.

# 6

హాలధరుడు నిత్యసంతోషి. భూమాతనీ, తల్లిదండ్రుల్ని సేవించు కొంటూ భగవత్సంకీర్తనతో కాలంగడుపుతూ ఉన్నాడు. పట్నం వెళ్ళి వచ్చినవారు అతని కలిసేవారు. అతని అన్నలు అనుభవిస్తూ ఉన్న భోగాల్ని, ఐశ్వర్యాన్ని వర్ణించి చెప్పేవారు. అని విని హాలధరుడు ఆనందించేవాడు. ఎవరు కోరిన రీతిగా వారికి కాలం గడుస్తోంది.

# 2. కలిమహారాజు ఆలోచనలు

కలిమహారాజు భూలోకం చూసేటందుకు బైలుదేరాడు. తన పరిపాలన ఏ రీతిగా సాగుతోంది. అది ఎలా దినదినాభివృద్ధిచెందుతోంది. అని అజమాయిషీ చేద్దామని అనుకొన్నాడు. ఆయనకు ఆశ, అసూయ, అహంకారము అనేవారు ముగ్గురు నమ్మినబంట్లు. వారుకూడా ఆయనతో వచ్చారు. వారిదృష్టి హాలధరుడిమీద పడింది. కలిమహారాజుకు హాలధరుడి ధోరణి నచ్చలేదు. తనబంట్లను పిలిచాడు. ''చూడండి! ఈ అవ్యక్తుడి (పిచ్చివాడి) ధోరణి. మనం వీడి ఆటలు సాగనియ్యకూడదు. ఈ అన్నదమ్ములు ముగ్గురూ వాళ్ళల్లో వాళ్ళు కొట్లాడుకొంటారు; నాశనం అవుతారు అని అనుకొన్నాను. ఆశ, అసూయ, అహంకారము అందరినీ ఆశ్రయించి వశం చేసుకొనడం కలియుగధర్మం. వీడు జడుడు. వీడి మూలంగా ఈకుటుంబంవాళ్ళు మనపరిపాలనలోనించి తప్పించుకున్నారు. వీణ్ణి చూసి ఘరి కొందరుకూడా ఇట్లాగే నడుచుకోవచ్చు. అట్లా జరిగితే క్రమక్రమంగా మన పరిపాలనకే ప్రమాదం సంభవిస్తుంది. అందుచేత మీరు అప్రమత్తులై మెలగాలి. మీరు ముగ్గురూ వెంటనే బైలుదేరి వెళ్ళండి. ఆ ముగ్గురు అన్నదమ్ముల్నీ వశపరచుకోండి. వాళ్ళు ఒకరితో ఒకరు కొట్లాడుకోవాలి. ఒకరినొకరు నరుక్కోవాలి. ఏం అట్లా చెయ్యగలరా, లేదా?' అని అంటూ గర్జించాడు కలిమహారాజు.

''ఓ చెయ్యగలం, అదెంతపని మాకు!''

దానికేమీ పెద్దఆలోచన అక్కరలేదని మా మనవి. మొదట ఈ ముగ్గుర్నీ బికారుల్ని చేస్తాము. తినేటందుకు ఒక ముద్దకూడా లేకుండా

చూస్తాము. అందర్నీ కట్టకట్టి ఒకచోట పడేస్తాము. అప్పుడువాళ్ళు నాకు నీ మూలంగానే ఈ దుస్థితి కలిగింది. అంటూ ఒకళ్ళనొకళ్ళు నిందించుకొని కొట్టుకుచస్తారు. మనకు వీళ్ళపీడ విరగడవుతుంది'' అన్నారు ఆయనబంట్లు.

''శభాష్, మీకు ఏమి చెయ్యాలో బాగా అర్థమైంది. వెళ్ళండి. పనిసాధించి మరీ రండి. లేదా తాట వలిపిస్తా కబడ్దార్!''

ఆశ, అసూయ, అహంకారం మిగిలారు. ఎవరు ఎవరిని వశం చేసుకోవలసిందీ లాటరీచీట్లు వేసి నిర్ధారణ చేసుకొన్నారు. ఆరునెలలైన తర్వాత మనం ఇక్కడే తిరిగి కలుసుకొందాము. చేసిన కృషి విమర్శించుకొందాము. తర్వాత మన అనుభవాలనుబట్టి ఏమి చెయ్యవలసిందీ నిశ్చయించుకొందాము. అవసరమైతే ఒకరికొకరు సాయం చేసుకొందాము', అని అనుకొన్నారు.

అహంకారము జయశీలుడిని ఆవేశించింది. ఆశ ధనశీలుడి చెంత జేరాడు. అసూయ హాలధరుడిని లోబరచుకోవాలనే ప్రయత్నంతో మొదలు పెట్టింది. ఆరునెలలు గడిచాయి. మిత్రులు ముగ్గురూ సంకేతస్థానంలో కలుసుకున్నారు. తమ తమ అనుభవాలు కలబోసి ఆలోచించడం మొదలు పెట్టారు.

అహంకారము ఇట్లా అన్నాడు. ''నేను మొదలుపెట్టిన వ్యవహారం సజావుగా సాగిపోతోంది. రేపటితో పని పూర్తి అవుతుంది. జయశీలుడు పరాజితుడై చావుతప్పి బికారిగా తండ్రిదగ్గరకు చేరుకొంటాడు.''

''నీవు అదృష్టవంతుడివి. ఎట్లా సాధించావు ఆ పని? కొంచెం వివరంగా చెప్పు'' అన్నారు మిగిలిన ఇద్దరూ.

మొదట్లో జయశీలుణ్ణి పూర్తిగా ఆవేశించాను. వెంటనే అతనికి పల్లమాలిన గర్వం కలిగింది. తన రాజుదగ్గరకు వెళ్ళాడు. "మహారాజా! నేను చాలాకాలంగా తమ కొలువుచేస్తున్నాను. నాకూ, సైనికులకూ ఏమీ పనిలేకుండా ఉంది. పుష్టిగాతింటూ, కవాతుచేస్తూ, కాలం గడపుతున్నాము. మా చేతులతీట పోయేలాగ, దిగ్విజయానికి ఆజ్ఞ ఇవ్వండి." అన్నాడు. రాజు 'సరే' అన్నాడు. జయశీలుడు సైన్యంతో బైలుదేరాడు. పుళిందదేశంమీదికి దండెత్తాడు. ఆ దేశంలో జనాభా ఎక్కువ. నేను నా మాయచేత సైనికుల్ని కల్పించాను. ఆ సైన్యం అంతా కలిసి నేల ఈనినట్లు కన్పించింది. రేపు రెండుసైన్యాలూ ఢీకొంటాయి. సంకుల సమరం జరుగుతుంది. రెండుపైపులవారూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు. ఆ రాత్రి నేను నా మాయాబలంవల్ల జయశీలుడి శిబిరంలో ప్రవేశించాను. అతని సైనికుల తూటాలూ తుపాకీమందూ నెమ్ముకొనేలా నీరు చల్లాను. మరుసటిరోజు యుద్ధం జరిగింది, పుళిందసైన్యం జయశీలుడి సైన్యాన్ని ఊచకోతగా నరికింది. అతని సైన్యం కిక్కురుమనకుండా పండుటాకుల్లా నేలమీద రాలింది. కొందరు పిక్కబలం చూపించి పరుగెత్తారు హతశేషులతో జయశీలుడు తన రాజు కొలువుకు వెళ్ళాడు. తిరిగి సైన్యం సమకూర్చుకొని పునఃప్రయత్నం చేస్తానని చెప్పాడు. రాజుకు ఆ మాటలు నచ్చలేదు, నీ గర్వపోతుమాటలు నమ్మాము. ఒకసారి మోసపోయాము. నీవు రెండోసారి మోసం చెయ్యలేవు. నీకు తగిన శిక్ష ఉరి. రేపు నిన్ను ఉరితీయిస్తాము. గర్వపుమాటలు చెప్పకూడదు. రాజును తప్పుదారి పట్టించకూడదు. అని మిగిలినవాళ్ళందరికీ కూడా బుద్ధివస్తుంది.' జయశీలుడికి అవమానం జరిగింది. ఇప్పుడు ఖయిదులో ఉన్నాడు. "నేను అతణ్ణి ఖయిదులోంచి తప్పించాలి, మారువేషంతో తండ్రి ఇంటికి చేర్చాలి. అదొక్కటే నాకు మిగిలినపని. రేపటి

నుంచి మీలో ఎవరికి కావాలంటే వారికి సాయంచేస్తాను'' అని కథ ముగించాడు అహంకారం.

ఆ తర్వాత ఆశ తన కథ మొదలుపెట్టాడు. ''నా వాటా పని కూడా అనుకొన్నట్లుగానే సాగిపోతోంది. నాకేమీ సాయం అక్కరలేదు. వినండి చెపుతా. మహాసాగితే ధనశీలునిపని మరొక్కవారంపాటు ఉంటుంది. అంతకంటె ఎక్కువకాలం నడవదు. నేను ధనశీలుణ్ణి బాగా ఆవేశించాను. వెంటనే అతనికి ఎక్కడలేని ఆశా కలిగింది. ఏది కన్పించినా అది తనకి కావాలనే కోరిక కలిగింది. ఎంత ఖరీదైనా సరే కనిపించినదల్లా కొనడం మొదలుపెట్టాడు. ఉన్న సొమ్ము అంతా ఖర్చు చేసాడు. అందరిదగ్గరా దొరికినంతవరకు అప్పులు చేసాడు, 'ధరలు బాగా ఆకాశం అంటేలా అవుతాయి. నేను కొని నిలువచేసిన సరుకుని ఐదురెట్లూ, పదిరెట్లూ లాభం వేసుకొని అమ్ముతాను. ఈ అప్పులు నాకొక లెక్కా' అని కలలు కంటున్నాడు. ఒకటి రెండురోజుల్లో అతనికింక అప్పిచ్చేవారుండరు. నేను రకరకాల చీడపురుగుల్ని ధనశీలుడి గోదాముల్లో ప్రవేశపెటాను. అవి సరకునంతటినీ నాశనం చేస్తాయి. వారంరోజుల తర్వాత అక్కడ మిగిలేది మసే, నుసే, ధనశీలుడు దివాలా. పువ్వులు అమ్మిన ఊళ్ళో కట్టెలు అమ్మేటందుకు మొగంచెల్లక వెంటనే పరారీ అవుతాడు. హలధరుడి చాటున బతుకుదామని అక్కడికి చేరుకొంటాడు. ఆ తరవాత కథను మనం అందరం కలిసి నడిపించాలి. ఇంక అసూయ తన కథ చెప్పాలి.' ఏం అసూయా, ఎలా సాగుతోంది నీ కార్యక్రమం? అన్నారిద్దరూ. అసూయ మొగంతో నిరుత్సాహం తొణికిసలాడుతుంది. నిట్టూర్చి తనకథ మొదలెట్టాడు. ''నా వ్యవహారం అనుకొన్నరీతిగా సాగటంలేదు. హలధరుణ్ణి ఆవేశించాలని చూసాను.

వాడు లొంగేటట్లు కనబడలేదు. చలించలేదు. నన్ను దరిదాపులకు కూడా రానివియ్యలేదు. ఇలా చాలారోజులు గడిచాయి. సరేకదా అని చివరికి వాడు తాగే నీళ్ళను మంత్రించాను. వాడికి కడుపునొప్పి వచ్చింది. అందరు మనుషుల్లాగే వాడుకూడా విశ్రాంతి తీసుకొంటాడనుకొన్నా. అబ్బే! వాడు ఆ కడుపునొప్పితోనే నాగలి బుజాన వేసుకొని బైలుదేరాడు. 'ఇలా ఉందా వీడిపని?'' అనుకొని నేను వెంటబడ్డాను. వాడికంటె ముందే వాడు దున్నే పొలానికి వెళ్ళాను. నాగలికర్రు భూమిలో దిగకుండా దిమ్మిసా చేసినట్లు నేల గట్టిగా ఉండేటట్లు చేశాను. నాగలికర్రు నేలలో దిగలేదు కాని, ఆ మొండివాడు ఒకపక్క కడుపు నొప్పితో మూలుగుతూనే మేడికర్రని బాగా అదిమిపట్టి దున్నసాగాడు. భూమి లొంగక ఏమిచేస్తుంది? పెళ్ళపెళ్ళలుగా విరిగింది. పొలంలో చాలు పడింది. తర్వాత కామరూపం ధరించి భూమిలో దూరాను. నాగలి నాగలికర్రును చేతులతో వాచేసుకొని బలంగా వెనక్కులాగి పట్టు కొన్నాను. వాడు మరింత బలంగా నొక్కి తోయడం సాగించాడు. నా చేతులు పుండ్లు పడ్డాయి. కాని, వాడిపని సాగిపోయింది. పొలం అంతా దున్నేశాడు. ఒక చిన్నమడి మాత్రం మిగిలింది. మీరు నాకు ఆసరా కావాలి. లేకపోతే పాడిపంట పండిస్తూనే ఉంటాడు. చెడి తన చెంతకు చేరిన అన్నతమ్ముళ్ళి ఒక్కమాటకూడా అనకుండా పోషిస్తూనే ఉంటాడు. అట్లాగ ఎంతకాలమైనా సరే గడిచిపోతుంది. మీరు పడ్డశ్రమ కూడా నిష్ఫలమవుతుంది. మనం మన మహారాజుకు ఇచ్చినమాట దక్కదు.''

''అవును. నీ పని గడ్డుగానే ఉంది. నేను ఈ జయశీలుడి పని పూర్తిచేసి నీకు ఆసరా అవుతాను.'' అని అహంకారం అన్నాడు.

ముగ్గురు మిత్రులూ ఎవరిదారిన వారు వెళ్ళారు.

# 3. అసూయ గర్వభంగము

హలధరుడు పొలంలో కూర్చున్నాడు. పొలంఅంతా దుక్కి చెయ్యడం సుమారుగా పూర్తిఅయింది. కొస్త చిన్నమడి చెక్క మిగిలింది. కడుపునొప్పి నులిమేస్తోంది. ఐనా సరే. ''ఎట్లాగైనా దున్నడం ఈ రోజే పూర్తిచెయ్యాలి'' అనుకున్నాడు. కాడికి కట్టిన ఎద్దులమెడ పలుపులు కొంచెం వదులుచేసాడు. మళ్ళీ దున్నడం మొదలుపెట్టాడు. చాలుపడింది. తిరిగి రెండోచాలు పడేటప్పుడు నాగలికర్రకు ఏదో అడ్డం పడినట్లు అనిపించింది. ''ఇక్కడ దగ్గరలో ఏమీ చెట్లులేవు. చెట్లవేళ్ళు ఉండే అవకాశంకూడా లేదు. నాగలికర్రని దిగలాగుతూ ఉన్నది ఏమై ఉంటుంది? చూద్దాము.'' అని చేత్తో భూమిలో కెలికి పైకి వేరులాగ కనిపిస్తో గింజుకొంటున్న అసూయను పైకిలాగాడు. అసూయ గిలగిల లాడుతూ ''నన్ను క్షమించు; నాకు బుద్ధి వచ్చింది. ఇంక ఎప్పుడూ నీ జోలికి రాను'' అంటూ హలధరుడిని బతిమాలాడు.'' ఎంత అవ హ్యంగా ఉన్నావు. మనిషిలా మాటలాడుతున్నావే. ఎవరో పిశాచివి కాబోలు. ఉండు నీ భరతం పడతా అంటూ రాయి పైనవేసి కొట్టబోయాడు. ''ఉండు; ఉండు. నన్ను రాతికేసికొట్టకు. నీకేం కావాలో కోరుకో నీ కోరిక తీరుస్తా.'' అని అసూయ వినయంగా కోరాడు. హలధరుడికి ఏం కోరుకోవాలో తోచలేదు. బుర్రగోక్కున్నాడు. అతనికి తనకడుపునొప్పి జ్ఞాపకంవచ్చింది. వెంటనే 'నాకు కడుపునొప్పిగా ఉంది. దానికి మందు ఇయ్యగలవా?' అన్నాడు. 'ఓ తప్పకుండా'

అన్నాడు అసూయ. 'అయితే సరే, కానీ!' అని హాలధరుడు వదిలాడు.

అసూయతో భూమిలోకి చొచ్చుకొనిపోయాడు. ఎక్కడో పాతాళలోకంనుంచి తెచ్చినట్లు మూడు వేరు ముక్కల్ని తెచ్చి హాలధరుడి కిచ్చాడు. "ఇవి సంజీవిమూలిక ముక్కలు. ఒక్కముక్క నమిలి మింగితే సరి. ఏ రోగమైనా వెంటనే తగిపోతుంది. ఇప్పుడే పరీక్ష చెయ్యి. నా మాట నమ్మకం తెలుస్తుంది." అని చెప్పాడు. హాలధరుడు ఒకవేరు ముక్కనమిలి మింగాడు. అతని కడుపునొప్పి చేత్తో తీసిపారేసి నట్లు వెంటనే మాయమైంది. సంతోషంతో "నీ వెవరో నాకు తెలి యదు. కాని, భగవంతుడిదయవల్ల నీకు ముక్తి లభించింది. నీ దారిని నీవు పోవచ్చు." అన్నాడు. కలిమహారాజుకి భగవంతుడికి చుక్కెదురు. అందుచేత భగవంతుడిదయ అనేమాట చెవులు పడగానే ఆయనకూ ఆయన అనుచరులకూ కంపరమెత్తుతుంది. తమ్మెతాము మరచి పోతారు. అట్లాగే అసూయకూడు ఉన్నవాడు ఉన్నరీతిగా భూమి లోకి చొచ్చుకొనిపోయాడు. ఎవరో తోసినట్టుగా పాతాళలోకంలోకి పడిపోయాడు. అక్కడ ఒక సొరంగం ఏర్పడింది. "శని విర గడైంది." అనుకొంటూ మిగిలిన రెండు వేరుముక్కల్నీ హాలధరుడు జాగ్రత్త పెట్టాడు. మిగిలిన మడి దున్నడం పూర్తిచేసి ఇంటికి వెళ్ళాడు. కాడికి కట్టిన ఎద్దుల్ని విప్పి పొలంలో కట్రాడుకు కట్టి, మేతవేశాడు. కాళ్ళుచేతులూ కడుక్కొన్నాడు. వంటింట్లో జయశీలుడూ అతని నవ నాగరిక భార్యా కన్పించారు. ఆమె ముక్కు మూసుకొని చీదరించు కొంది. "మట్టివాసన కొట్టే ఈ మనిషితోనా మన పంక్తిభోజనం?" అని పైకి అనేసింది. వెంటనే జయశీలుడు 'ఒరే తమ్ముడు' నువు

కొంచెంసేపు ఆగి భోజనం చెయ్యరా. లేదా బైట రోడ్డిలో అయినా చెయ్యి. మీ సుకుమారమ్మ వదిన రైతుల మట్టివాసన సహించలేకుండా ఉంది!'' అన్నాడు. ''సరేలే, తెల్లారేసరికి మళ్ళీ నేను ఎట్లాగు పొలానికి పోవాలి. లేగదూడకు పచ్చగడ్డికూడా కోసుకొని రావాలి. పొలంలో ఎప్పుడూ ఏదో పని ఉంటూనే ఉంటుంది. నా భోజనం అక్కడికే పంపించమం టానులే'' అంటూ పొలానికి వెళ్ళిపోయాడు.

# 4. అహంకారం గర్వభంగము

జయశీలుడిని నాశనంచేసిన తర్వాత అహంకారము హలధరుడి దగ్గరకు వచ్చాడు. పొలంలో అసూయకోసం వెతికాడు. అసూయ ఎక్కడా కన్పించలేదు. కాని, అక్కడ పాతాళంవరకూ పోయేటటువంటి సొరంగం మాత్రం కన్పించింది. "నా మిత్రుడికి ఏదో ఆపదమూడింది కాబోలు. ఈ మొండివాడు పాలబడ్డాడు. వీడిపడి పట్టాలి." అనుకొన్నాడు. అహంకారము హలధరుడికోసం అతన్ని పచ్చగడ్డి ఓడులో చూశాడు. హలధరుడు పచ్చగడ్డి కోస్తున్నాడు. అహంకారం పంట కాలవగట్టు తెగగొట్టాడు. పచ్చగడ్డి నీటిలో మునిగింది. "బురదమట్టి వల్ల కొడవలి పదును చెడింది. దీనికి పదును పెట్టించి తెచ్చి కోతపూర్తి చెయ్యాలి. అది పూర్తి అయ్యేదాకా మరోపని తలపెట్టను. ఆకలి కాకుండా తినేటందుకు నాతో ఏమైనా తెచ్చుకోవాలి. పనిలో పని కలిసి వస్తుంది." అనుకొంటూ హలధరుడు ఇంటికి వెళ్ళాడు. "వీడు శుద్ధ కొరకరాని కొయ్యలాగ ఉన్నాడు. ఇట్లా లొంగడు. ఏదైనా మరో ఉపాయం చూడాలి" అనుకొన్నాడు అహంకారము.

హలధరుడు కొడవలికి పదును పెట్టించాడు. తిరిగి పచ్చిగడ్డికోయ సాగాడు. అహంకారము గడ్డి దుబ్బుల్లో దూరాడు. కామరూపం ధరించి, కొడవలి మొనను ఇటూ అటూ లాగసాగాడు. అది మాటిమాటికీ భూమిలో దిగబడిపోయేది. పని ఆలస్యం కాసాగింది. అహంకారము, పట్టు వదలకూడదనుకొన్నాడు. హలధరుడు ఒక గడ్డి దుబ్బుదగ్గరకు

వచ్చాడు. అది అంత ఒత్తుగాలేదు. కాని, తెగకుండా చీకాకు పెట్ట సాగింది. హలధరుడు విసిగి, కొడవలిని ఇటూ అటూ విసరివేస్తూ నరక సాగాడు. ఆ వేట్లు తప్పించుకొనేటందుకు ప్రయత్నిస్తుండగా అహంకారము తోక తెగింది. ఆ బాధకు తాళలేక మరో దుబ్బుచాటున దాక్కున్నాడు. కోసిన గడ్డిని హలధరుడు మోపులు కట్టుకుని పాలేరుకు అప్పగించాడు. సారవా చేను కోతకు వచ్చిందేమో చూద్దామని అక్కడకు వెళ్ళాడు.

"చీకటి పడుతోంది. హలధరుడు రోజంతా పనిచేసి బాగా అలసిపోయాడు. అందుచేత కొంచెం విశ్రాంతి తీసుకొంటాడు. నేను కూడా కొంత విశ్రాంతి తీసుకోవచ్చు. రేపు పంటచేలో వీడి పని ఎలా సాగుతుందో చూస్తాను." అని అహంకారము నిద్రపోయాడు.

హలధరుడు పంటచేను చూశాడు. "చేను కోతకు వచ్చింది. పగటిపూట కోస్తే ఎండకి ఎండి, గింజలు పట్టువదిలి జలజలా రాలిపోతాయి. గింజల నష్టం ఎక్కువ అవుతుంది. అందుచేత అన్నం పొలానికే తెప్పించుకొని తింటాను. రాత్రికి రాత్రికే చేను కోస్తాను. చల్లబాటువేళ పనికూడా చురుకుగా సాగుతుంది. పంటఅంతా దక్కుతుంది." అని అనుకొన్నాడు. అట్లాగే చేశాడు.

మరుసటిరోజు ఉదయం కాగానే అహంకారం చేలోకి వచ్చాడు. కోత పూర్తి అవడం చూశాడు. ఎంతో ఉక్రోషం వచ్చింది. "ఈ మొండివాడు ఇనుపమనిషిలాగున్నాడు. వీడికి ఎండ, కొండ, అలసట అనేవి ఏమీ ఉన్నట్టులేవు. ఇప్పుడు కోసిన పనలకింద దూరి పంట కుళ్ళబెడతా. అప్పుడేం చేస్తాడో చూద్దాం', అని అనుకొని అహంకారం పనల కింద దూరాడు. అవి కుళ్ళడం మొదలు కాగానే కొంచెం వెచ్చబడ్డాయి.

ఆ మెచ్చుదనానికి నిద్ర వచ్చి అహంకారము నిద్రపోసాగాడు. హలధరుడు పొద్దు వాలగానే చేలోకి వచ్చాడు. పనల్ని పోగుచేసి కుప్ప వెయ్యాలని అనుకున్నాడు. పరకల్ని దగ్గరకు లాక్కొని పోగు చేసుకొనేటందుకు వాడిగా మొనతేలిఉన్న పంగలకర్రలాంటి సాధనాన్ని (రాగోల) అతను వాడేవాడు ఆ సాధనం పనతో గుచ్చుకొనేటట్లు బలంగా ఎత్తి వేశాడు. అది ఆ పనలోనే నిద్రపోతున్న అహంకారం డొక్కలో గుచ్చుకుంది. వెంటనే 'కుయ్యో'మంటూ లేచాడు. ''మళ్ళీ తయారయ్యావా ఇక్కడికి? ఉండు నీ భరతం పడతా! ఈసారి ఎంత మొత్తుకొన్నా సరే వదలను.'' అన్నాడు హలధరుడు.

''నేను మరొకణ్ణి నిన్నటివరకూ మీ అన్న జయశీలుడి దగ్గర ఉండే వాణ్ణి. నన్ను వదులు. ఇంక ఎప్పుడు నీ జోలికి రాను.'' అన్నాడు అహంకారము.

''నీవు ఎవరవైతే నాకేమి? ఎక్కడినుంచి వస్తే నాకేమి? నిన్ను నేలకేసి చితక్కొట్టి మరోపని చూసుకొంటాను'' అన్నాడు హలధరుడు కరుకుగా.

''బాబ్బాబు నన్ను వదులు. నీ మేలు మరిచిపోను. నీకు ఉపకారం చేస్తాను.'' అని. అహంకారం ఎంతో ప్రాధేయపడుతూ అన్నాడు.

''ఏమి ఉపకారం చేస్తావు? నీవేమి చెయ్యగలవు?'' అన్నాడు హలధరుడు కుతూహలంతో.

''నేను దేనినుంచైనా సరే సైనికుల్ని కల్పించగలను. ఆ శక్తి నీ కిస్తాను'' అని అహంకారము జవాబు ఇచ్చాడు.

''ఆ, అట్లాగా! వాళ్ళెందుకు పనికొస్తారు?'' అన్నాడు మరింత ఆశ్చర్యపడుతూ హలధరుడు.

''నీవు ఏ పని చెయ్యమంటే ఆ పని చేస్తారు. నీ వద్దీలో ఉంటారు'' అన్నాడు అహంకారము.

''అట్లాగా. అయితే వాళ్ళు పాటలు పాడగలరా?''

''ఓ, నీవు ఆజ్ఞాపిస్తే సరి.''

''అయితే తయారుచెయ్యి కొంతమంది సైనికుల్ని. చూస్తా ఆ తమాషా ఏమిటో.''

''అదిగో! ఆ వరికంకి తీసుకో. ఇలాగ అను:—

'గింజల్లారా! గింజల్లారా
ఇదిగో! ఇదిగో నా ఆజ్ఞ!
ఒక్కొక గింజ ఒక్కొక సైనికు
డిదిగో ఇప్పుడె కావాలి.
ఇప్పుడె ఇక్కడ నిలవాలి'

అంటూ దూరంగా విసిరేయి.''

హలధరుడు అలాగే చేశాడు. వెంటనే అక్కడ ఒక సైనికుల పటాలము భూమిలోనుంచి మొలిచినట్లుగా లేచింది. హలధరుడి ముఖం సంతోషంతో కలకలలాడింది. ''బలే. బలే బాగుంది. ఊళ్ళో అందరికీ తమాషాగా ఉంటుంది.''

''ఇంక నన్ను పోనివ్వు'' అన్నాడు అహంకారము.

''అప్పే వీల్లేదు. మళ్ళీ వీళ్ళని గింజలుగా మార్చెయ్యాలి.''

''కావలసినప్పుడు నేను గడ్డిపరకలనుంచి సైనికులిని కల్పించాలి.

అంతే కాని తిండికి పనికొచ్చే గింజల్ని ఇట్లా పాడుచేసుకోవడానికి సుతరామూ వీల్లేదు.'' అన్నాడు హలధరుడు.

''అయితే సరే ఇట్లా అను:—

ఎక్కడినుంచో వచ్చిన సైనికు
లక్కడి కిప్పుడే పోవాలి
ముందటి రూపం ఇప్పుడె
మీరూ, మరుక్షణంలో, దాల్చాలి.''

అన్నాడు అహంకారము. హలధరుడూ అలాగే అన్నాడు. ఎక్కడి సైనికులు అక్కడే మాయం అయ్యారు. మళ్ళీ వరి కంకులు మిగిలాయి. ''ఇంకనైనా నన్ను పోనియ్యి. డొక్కలో గుచ్చిన ఈ కొంకి కర్రని లాగిపారెయ్యి. దేనినుంచి అయినా సరే ఎప్పుడు కావాలంటే అప్పుడు గడ్డిపరకలవించికూడా నీవు సైనికుల్ని సృష్టించగలవు.''అని బతిమాలాడు అహంకారము. ''సరే భగవంతుని దయవల్ల నీకు ముక్తి లభించింది. నీ దారిని నీవు పో'' అన్నాడు హలధరుడు. ఆ మాట వినగానే అహంకారం కూడా ఎవరో తోసినట్లుగా పాతాళంలోకి పడిపోయాడు. అక్కడ ఒక సొరంగం ఏర్పడింది.

హలధరుడు ఇంటికి తిరిగివచ్చాడు. స్నానంచేసి భోజనశాలలోకి భోజనం చేద్దామని వెళ్ళాడు. అక్కడ అతనికి ధనశీలుడు, అతని భార్య కనిపించారు. ''వ్యాపారంలో ఒడుదుడుకులు వచ్చాయి. కాలూ చెయ్యి కూడదీసుకొని మళ్ళీ మొదలుపెట్టాలి. అందాకా మే మిక్కడే ఉందామను కొంటున్నాము. ఏమంటావురా?'' అని ధనశీలుడు తమ్ముడితో అన్నాడు. ''దానికేమి. మా తోపాటే మీరూ ఉండండి '' అని హలధరుడు నిర్వి కారంగా భోఅన్నాడు. జనానికి కూర్చున్నాడు.

''ఈ పల్లెటూరి బైతుకి నే నెట్లా వడ్డించేది? చెమటకంపు బాగా గుమాయిస్తోంది.'' అంది ధనశీలుడి భార్య.

''ఒరేయి, నీవేమీ పళ్ళుతో ఒళ్ళు రుద్దుకొన్నట్లు లేదు. బాగా ఘాటుగా ఉన్నట్లున్నావు కాబోలు. పోనీ, ఆరుబయట కూర్చుని తిన కూడదటరా ఆ కాసిని మెతుకులు'' అన్నాడు ధనశీలుడు.

''సరేలే. అందుకేమీ అభ్యంతరంలేదు. నాకు కూడా ఆరుబయట తింటేనే బాగా వయిస్తుంది. తిన్నది వంటబడుతుంది'' అన్నాడు. ఏమీ మర్మం తెలియని హలధరుడు.

# 5. ఆశ గర్వభంగము

ఆశ ధనశీలుడి పని పూర్తి చేశాడు. హలధరుడి దగ్గరకు వచ్చాడు. తనమిత్రులు అసూయ, అహంకారము ఎక్కడ ఉన్నారో అని వెతక సాగాడు. దుక్కి చేసిన మడిగట్టునా పంటచేనులోనూ పాతాళందాకా ఉన్నట్లు కన్పించే రెండు సొరంగాల్ని చూశాడు. పచ్చగడ్డి దుబ్బు పక్కనే తెగిపడిన తోకముక్కను చూశాడు. తన మిత్రులిద్దరికీ ఏదో ప్రమాదం సంభవించిందని నిశ్చయించుకొన్నాడు. ఇంక హలధరుడి సంగతి తానొకడే చూసుకొనవలసిందని అనుకొన్నాడు.

హలధరుడు పంటను పూర్తిగా ఇంటికి చేర్చాడు. "అన్న లిద్దరూ తమ కుటుంబాలతో వచ్చారు. ఈ ఇల్లు పాతకాలంనాటిది. దీని పంపిణీకూడా పాతదే. అందుచేత వారికి అలవాటైన సౌకర్యాలు లేవు. వార్తు ఇక్కడే కొంతకాలం ఉండేటట్లు కనిపిస్తోంది. సాధ్యమైనంత త్వరగా వారికోసం కేటాయింపుగా చిన్న ఇళ్ళు కట్టాలి. అన్ని హంగులూ ఏర్పాటు చెయ్యాలి. అందుచేత ముందు కావలసిన కలపకొట్టి ఇంటికి చేర్పించాలి" అని హలధరుడు ఆలోచన చేశాడు.

హలధరుడు గొడ్డలి బుజానవేసుకొని అడివికి బయలుదేరాడు. కలపకోసం చెట్లు కొట్టడం మొదలుపెట్టాడు. ఆశ హలధరుడి వెంటా డాడు. "ఇక్కడే వీడి అంతు తేల్చాలి" అని అనుకొన్నాడు. హల ధరుడు చెట్టు కొట్టేవాడు. అది కిందపడేలోపుగా ఆశ ఆ చెట్టును మెల్లి తిప్పేవాడు. ఆ చెట్టు, పక్కచెట్టు కొమ్మల్లో ఇరుక్కునేది. ఇలా చెయ్య

ఠంలో ప్రతిచెట్టూ పడగొట్టడం ఆలస్యం అయేది. అందుచేత పక్కచెట్టు కొమ్మల్ని నరికి మొదట కట్టిన చెట్టుని పంటికర్రతో కిందికి నెట్టవలసి వచ్చేది. హలధరుడికి శ్రమ హెచ్చింది. బాగా చెమటపోసింది. అది ఆవిరై పొగలు కమ్మింది. కాని, కిందపడినచెట్లు ఆట్టే లేవు. ఏమిటూ పని ఇట్లా ఆలస్యం అవుతోంది. అలసటే నా పాలవుతోంది. అని కొడు తున్న చెట్టులో గొడ్డలి దిగేసి హలహరుడు విశ్రాంతి తీసుకోసాగాడు. ఆళ కొంత తృప్తిచెందాడు. చిరునవ్వు నవ్వుకొన్నాడు. తాను కూడా కొంత విశ్రాంతి తీసుకోవచ్చు. హలధరుడు దారిలోకి వస్తున్నాడు, అను కొంటూ ఆ చెట్టుకొమ్మల్లో కూర్చున్న ఆళ అలా కూర్చునే మాగ న్నుగా నిద్రపోసాగాడు.

హలధరుడు కొంచెంసేపు విశ్రాంతి తీసుకొన్నట్టు కూర్చున్నాడు. టక్కున మెరుపులా లేచి సగం నరికిన చెట్టులోంచి గొడ్డలి లాగాడు. ఊతంగా ఒక గట్టిదెబ్బ వేశాడు. వెంటనే ఆ చెట్టు దభాలుమని కింద కూలింది. ఇదంతా కన్నుమూసి తెరిచేలోగా జరిగింది. అందుచేత ఆళ కావలేకపోయాడు. హలధరుడు చేస్తున్నపనికి అడ్డు తగలలేకపోయాడు. పైగా ఆళయొక్క కాళ్ళు భూమికీ చెట్టు మొదటికీ మధ్యని ఇరుక్క పోయాయి. వాటిని పైకి లాక్కొని ఎట్లా బైటపడటమా అని పెనుగు లాడసాగాడు. హలధరుడు ఆళను చూశాడు.

"ఓ నీవా! ఇక్కడికి మళ్ళీ దాపురించావా? ఈ దెబ్బతో నీ పని సరి. ఇంక దయతలిచేది లేదు." అంటూ గొడ్డలి ఎత్తాడు.

"నేను మరొకణ్ణి ఇక్కడికి వచ్చేముందు ధనశీలుడిదగ్గర ఉండే వాణి." అని ఆళ బిక్కచచ్చిన మొగంతో అన్నాడు.

"నీ వెవరైతే నాకేమి? ఎక్కడినుంచి వస్తే నాకేమి? నీకు

నేటితో భూమిమీద నూకలు చెల్లిపోయాయి. కాచుకో ఈ గొడ్డలిదెబ్బ చాలు నీ ప్రాణానికి'' అని చీత్కరించాడు హలధరుడు.

''వద్దు. నన్ను కొట్టకు. నీకేమి కావాలో చెప్పు ఇస్తా'' అన్నాడు ఆశ.

''ఏదో ఇస్తాడట! నీవు ఏమి ఇవ్వగలవు? అయినా నాకు ఏమి కావాలి?'' అని ప్రతిమాట దగ్గరా ఆగుతూ అన్నాడు హలధరుడు.

''నీకు బంగారం చేసుకోవడం ఎలాగో నేర్పుతా. కావాలంటే చూడు'' అన్నాడు ఆశ.

''అలాగా? ఏదీ చూద్దాం కానీ'' అన్నాడు హలధరుడు, తమాషా చూద్దామనే కుతూహలంతో.

''ఇదిగో ఆ మర్రిఆకులు దోసిటనిండా తీసుకో. అరచేతుల్లో నలిపి కిందికి పోస్తూ మనసులోనే ఇలా అనుకో:—

''పసరుటాకులే బంగారం
ఇది నా కిచ్చిన వరప్రభావం
మర్మం తెలిసీ
ఆశను గెలిచీ
నేర్చిన విద్యకు
ఫలితం.
వన్నెల చిన్నెల
మొహరీల్లారా
కంగున మోగుచు

గెంతండీ
చెంగున దూకుచు
మ్రోగండీ
లోకమంతటా
తిరగండీ.''

హలధరుడు ఆళ చెప్పినరీతిగా చేశాడు. బంగారపు మొహిరీలు గలగలా పోగుపడ్డాయి. వాటిని చూసి ''పచ్చగా బాగా మెరుస్తున్నాయి. పండగరోజుల్లో ఆడపిల్లలు వీటితో తంగెడుబిళ్ళ ఆడుకోవచ్చు.'' అనుకొంటూ హలధరుడు సంతోషించాడు.

''ఇంక నన్ను పోనియ్య.'' మరి అని ఆళ ఎంతో దీనంగా అడిగాడు.

''సరే భగవంతుడి అనుగ్రహంవల్ల నీకు ముక్తి దొరికింది.', అంటూ హలధరుడు ఆళని విడిపించాడు. ఈ మాటల్ని వినీ వినగానే ఆళ కూడా నీళ్ళల్లోపడ్డ రాయిలాగ పాతాళంలోకి చొచ్చుకొనిపోయాడు.

# 6. ఉగాదిపండుగ సంబరాలు

హలధరుడు అన్నలకు ఇళ్ళుకట్టి ఇచ్చాడు. అవసరమైన సరుకులన్నీ వారి ఇండ్లకు చేర్చాడు. వారు తమకు నచ్చిన రీతిగా హాయిగా ఉంటున్నారు. ఇలా ఉండగా ఉగాదిపండుగ వచ్చింది. "అందరమూ కలిసి పండగ చేసుకొందాము." అని హలధరుడు అన్నలతో చెప్పాడు. "మీ పల్లెటూరి పండుగల సంగతి మాతో చెప్పకు. అవి మాకు నచ్చవురా" అని అతని ఇద్దరన్నలూ ఏకగ్రీవంగా అన్నారు.

హలధరుడు ఇరుగుపొరుగు స్నేహితుల్ని పిలిచి పండుగచేశాడు. విందుభోజనాలు రుచిగా ఉన్నాయి. వరస అయినవారు బుక్కాయీ వసంతమూ చల్లులాడుకొన్నారు. పాటలు పాడారు. కోలాటం వేశారు. ఆ సందర్భంలో హలధరుడు చాలా ఉత్సాహంగా ఉన్నాడు. పాటలుపాడుతూ ఆడుతున్న పిల్లలదగ్గరకు వెళ్ళాడు. "నామీద ఒకపాట పాడండి. మీకు చక్కని బహుమతి ఇస్తా" అన్నాడు. వారికి హలధరుడి దగ్గర చాలా చనువు ఉంది.

"మా మంచివాడోయ్ హలధరుడూ
పొద్దున్నె లేస్తాడు హలధరుడూ
కోపమంటే ఎరుగడోయ్ హలధరుడూ
చిరునవ్వు నవ్వుతాడు హలధరుడూ
భూమాత భక్తుడోయ్ హలధరుడూ
పంటలన్ని పండించు హలధరుడూ

ఒళ్ళు దాచుకోదోయి హలధరుడూ
ఈ వాడ నున్నావు హలధరుడా!
సాటి ఎవరు నీకోయి హలధరుడ!
మురిసి మురిపించేవు హలధరుడ!
జేజేలు జేజేలు హలధరుడ!
జేజేలు నీకోయి హలధరుడ!

అంటూ కోలాటం వేస్తూ రాగయుక్తంగా పాడుతూ లయ తప్పక అడుగులు వేశారు. తరవాత "ఏదీ మాకు ఇస్తానన్న బహుమానం? ఇయ్యి" అంటూ అతని చుట్టూ మూగారు. హలధరుడు "ఉండండి ఇప్పుడే వస్తా" అంటూ ఒకగంప పట్టుకొని అడివికి పరుగెత్తాడు. "ఈ అమాయికపువాడు ఇచ్చేదేమిటి? కొంపతీసి వీడికి పిచ్చెక్కలేదు కదా", అని కొందరన్నారు. వాళ్ళు మళ్ళీ ఆటపాటల్లో పడ్డారు. కొంతసేపటికి హలధరుడు బరువుగా గంపను ఈడ్చుకొంటూ వచ్చాడు. "రండి! ఇవిగో మీకు బహుమతులు అందుకోండి." అంటూ ఒక్కొక్కరికి గుప్పెడేసి మొహిరీలు పంచిపెట్టసాగాడు. అందరూ వాటికోసం ఎగబడ్డారు. ఆ చుట్టుపక్కల ఉన్న ఆడా మగా చిన్నా పెద్దా ఆశతో ఎన్నిసార్లు వీలైతే అన్నిసార్లూ పుచ్చుకోవాలని చుట్టూ మూగారు. ఆ తొక్కిడిలో ఒక ముసలమ్మ కిందపడిపోయింది. జనం కాళ్ళకింద నలిగి ఆమెకు చచ్చే టంతపని అయింది. అది చూడగానే హలధరుడికి పట్టరాని విచారం కలిగింది. జనంమీద కోపంవచ్చింది. "ఓరి తెలివితక్కువ వాతిమ్మల్లారా! అవ్వని తొక్కి చంపేస్తున్నారర్రా. దూరంగా విసిరినవి అక్కడినుంచే అందుకోండి." అని మొహిరీల నన్నింటినీ పేరుపేరు వరుసలా పిలుస్తూ అన్ని దిక్కులకూ అందరివైపూ విసిరేశాడు. గంప ఖాళీ అయింది. జనం "ఇంకా ఇయ్యి. ఇంకా ఇయ్యి" అని అరవసాగారు. "మరో

సారి చూసుకొందాం లెండి. ఇప్పటికి ఇంతే'' అని హలధరుడు గంప దులిపి బోర్లించాడు. ఆ సంరంభంలో అతనికి ఇంకా తమాషా చెయ్యాలి అని అనిపించింది. ''వీటికి సైనికుల పాటలు వినిపించాలి. రమ్యంగా ఉంటుంది'' అని తోచింది. ''ఉండండి మీకు మరో తమాషా చూపిస్తా. మీరు పాడినపాటలేమీ బాగా లేవు. మీ రెవ్వరూ వినని పాటలు పాడించి వినిపిస్తా. ఇక్కడే ఉండండి..'' అని తన గడ్డిమేటి దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళాడు. ఒక గుప్పెడు గడ్డిపరకలు తీసుకొన్నాడు.

పరకల్లారా! పరకల్లారా!
ఇదిగో! ఇదిగో! నా ఆజ్ఞ
ఒక్కొక్క పరకా
ఒక్కొక్క సైనికు
డిదిగో ఇప్పుడె కావాలి
ఇప్పుడె ఇక్కడ నిలవాలి.''

అని అంటూ దూరంగా విసిరేశాడు. వెంటనే బిలబిలమంటూ సైనికుల పటాలం అక్కడ నిలబడింది. హలధరుడు వారిని నడిపించుకొంటూ తీసుకొచ్చి ఆటపాటలతో అందరికీ వినోదం కలిగించాడు. ప్రజలంతా ఆశ్చర్యంగా చూస్తూ వింటూ కాలక్షేపం చేశారు. కొంతసేపైన తర్వాత హలధరుడు ఆ సైనికుల్ని తన దొడ్లోకి నడిపించి వాళ్ళని మళ్ళీ గడ్డిపరకలుగా మార్చేశాడు. పండగ సంబరం పూర్తి అయింది. హలధరుడు అక్కడ నేలమీద పడుకొని హాయిగా నిద్రపోయాడు.

# 7. హలధరుడు అన్నలకు చేసిన సాయము

జయశీలుడు మరుపటిరోజు ఉదయం రాత్రి జరిగిన సంగతులు అన్నీ విన్నాడు. హలధరుడిదగ్గరకు వెళ్ళాడు. ''ఏరా ఆ సైనికుల్ని ఎక్కడినుంచి పిలుచుకువచ్చావు. వాళ్ళందర్నీ ఎక్కడికి పంపించే శావు?'' అని అడిగాడు.

''ఏం అవన్నీ నీకెందుకు? వాళ్ళతో నీకేం పని?,' అన్నాడు హలధరుడు. ''అదేమిట్రా అట్లా అంటావు. సైనికులుంటే రాజ్యమే సంపాదించుకోవచ్చు. వాళ్ళు లేకే నేనిక్కడ ఇట్లా ఉన్నా. తగినంత మంది సైనికులే ఉంటే....'' అన్నాడు జయశీలుడు. ''అయితే ఆ సంగతి నాకు ఇంతకుముందే ఎందుకు చెప్పలేదు. నీకు కావలసినంత సైనికులిని ఇస్తా. రా నాతో రా!'' అని హలధరుడు గడ్డివామిదగ్గరకు దారితీశాడు. జయశీలుడు అతన్ని అనుసరించాడు గడ్డివాములు పక్కనే ధాన్యపు గాదెలున్నాయి. అవి చూడగానే హలధరుడికి జ్ఞాపకంవచ్చింది కాబోలు వెంటనే జయశీలుడితో ఇలా అన్నాడు. ''చూడు, నీకు కావలసి నంతమంది సైనికుల్ని ఇస్తాను.

కాని, ఒకషరతు వాళ్ళని నీవు వెంటనే ఎక్కడికైనా మరో ఊరికి తీసుకొనిపోవాలి. ఇక్కడే ఉంటే ఈ తిండిగింజలన్నీ ఒక్క రోజులో దూసుకు తినేస్తారు.''

జయశీలుడు 'సరే' అన్నాడు.

హలధరుడు వరసగా గుంపులు గుంపులుగా సైనికుల్ని తయారు చేయసాగాడు. తయారైన సైనికులు ఊరంతా నిండిపోయారు. ఊళ్ళో నిలబడేటందుకు కూడా ఖాళీ లేదు. ''వీళ్ళు చాలా? ఇంకా కావాలా?'' అన్నాడు హలధరుడు.

జయశీలుడు సంతోషంతో సాగిపోయాడు. ''ఇప్పటికి వీళు చాలులే. బలే! గొప్ప సాయం చేశావు'' అని అన్నాడు.

''అయితే సరే, నీ కింకా కావాలంటే, రా. అప్పుడు మళ్ళీ తయారుచేస్తా. దానికేమీ లోటులేదు. అన్నాడు హలధరుడు.

జయశీలుడు ఆ సైన్యానికి నాయకత్వం వహించాడు. వాళ్ళని విజయయాత్రకు నడిపించాడు.

జయశీలుడు అట్లా వెళ్ళాడు. ఇట్లా వగర్చుకొంటూ ధనశీలుడు వచ్చాడు. అతని శరీరం లావు. అందుచేత మెల్లిగా వచ్చేటప్పటికి ఆలస్యం అయింది. అతను కూడా అంతకు ముందురోజున జరిగిన సంగతులన్నీ విన్నాడు.

''ఏమిరా! తట్టెడు మొహిరీలు పంచిపెట్టావుట. ఎక్కడినుంచి తెచ్చావురా? ధనం పాతు ఏమైనా దొరికిందా? పేరుపేరు వరసలా పిలిచి ఇచ్చావట. అవి కొంచెం దగ్గర ఉంటేనా....మంచి పెట్టుబడి పెద్దఎత్తున తిరిగి వ్యాపారం చేద్దును. దేశదేశాలనుంచీ సొమ్ము నా దగ్గరకే వచ్చిపడేది'' అన్నాడు

హలధరుడు మరింత ఆశ్చర్యపడ్డాడు. ''నిజంగానా? అయితే

నాతో ముందుగా చెప్పి ఉండవలసింది. ఇప్పుడైతే ఏమిటే. నీకు కావలసినన్ని మొహిరీలు ఇస్తాను'' అన్నాడు.

ధనశీలుడు సంతోషంతో పొంగిపోయాడు. మూడుగంపల మొహిరీలు ఇయ్యి, అవి చాలు. ఇప్పుడు పెట్టుబడికి వాటితో పని మొదలుపెట్టి నడిపించి చూస్తా. ఏలా సాగుతుందో'' అన్నాడు.

ఇద్దరూ అడివిలోకి వెళ్ళాడు. హలధరుడు మర్రి ఆకులు నలిపి గంపలనిండా పోశాడు. మొహిరీలు గలగలా గంపలనిండా పడ్డాయి. గంపలు కొప్పుదేరా నిండాయి.

''చాలా'' అని హలధరుడు అన్నగారిని అడిగాడు. ధనశీలుడు తాను చూస్తూ ఉన్నది కలకాదు కదా అనుకొన్నాడు. నిజమని తెలుసుకొని మరింత పొంగిపోయాడు. ''చాలులే ఇప్పటికి; నాకెంతో సాయం చేశావురా తమ్ముడూ'' అన్నాడు.

''సరే. ఎప్పుడేనా ఇంకా కావాలంటే అడుగు. మర్రి ఆకులు ఎన్ని కావాలంటే అన్నీ మన అడివిలో దొరుకుతాయి'' అన్నాడు హలధరుడు.

ధనశీలుడు తనకు లభించిన సంపదను బండ్లకు ఎత్తించుకొని వ్యాపారం చేసుకొనేటందుకు పట్నం వెళ్ళిపోయాడు.

హలధరుడు మామూలుగా తన పొలంలో పనిచేసుకొంటూ పంట పండించుకొంటున్నాడు. తాను కడుపునిండా తిని తన ఇంటికి వచ్చినవారి కడుపునింపి ఆదరిస్తూ ఉన్నాడు.

కొంకాలం గడిచింది. జయశీలుడు తన సైనికుల సాయంతో

ఒకరాజ్యం జయించి రాజు అయ్యాడు. ధనశీలుడు వ్యాపారంలో మళ్ళీ పూర్వంకంటె ధనవంతుడు అయ్యాడు. ఈ ఇద్దరన్నదమ్ములూ ఒకసారి కలుసుకొన్నారు. తమ తమ కష్టసుఖాలు చెప్పుకోసాగారు.

"నేను రాజ్యాలు జయించి రాజునయాను. నా పని దర్జాగానే ఉంది. కాని, సైనికులకూ పరివారానికీ జీతం బత్తాలు ఇచ్చేటందుకు ఖజానా ఖాళీగా ఉంది. అందువల్ల ఇబ్బంది అవుతోంది. అదే నా సమస్య" అన్నాడు జయశీలుడు.

"నేను వ్యాపారంలో బాగా లాభాలు తీశాను. ఇనప్పెట్టెలో బంగారం, వెండి, రత్నాలూ విరివిగా ఉన్నాయి. ఇతర వస్తువాహనాలు వేటికీ లోటు లేదు. కాని, ఎప్పుడు ఎవరు వచ్చి ఇంటిమీద పడలేక ఏమి దొంగిలిస్తారో, కన్నుకుట్టి దొమ్మీగా వచ్చి నా మీదపడి దోచుకుపోతారో అనే భయంతో అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకుని కాలక్షేపం చేస్తున్నాను. నాకేమైనా కొందరు నమ్మకమైన గూర్ఖా సైనికులుంటే బాగుండును" అన్నాడు ధనశీలుడు.

"అయితే ఇద్దరం మళ్ళీ మనవాడి దగ్గరకు వెడదాము. మరికొంత మంది సైనికుల్ని తయారుచేసి ఇమ్మని నేను అడుగుతాను. వాళ్ళని నీవు తీసుకో. నీ ఆస్తికి కాపలా ఉంటారు. నీవు వాణ్ణి బంగారం చేసి ఇమ్మని అడుగు. అది నా కియ్యి. నా పరివారానికి నెల జీతా లిచ్చేటందుకు వీలవు తుంది. మన ఇద్దరి సమస్యలూ చక్కగా పరిష్కారం అవుతాయి" అన్నాడు జయశీలుడు.

ఇద్దరన్నదమ్ములూ హలధరుడి దగ్గరకు బైలుదేరారు. జయశీలుడు ముందుగా వెళ్ళాడు. ఆప్యాయత ఒలకబోస్తూ పలకరించాడు. "ఒరే

తమ్ముడూ! నాకు సైన్యం చాలటంలేదు. మరికొంతమందిని తయారుచేసి ఇయ్యి'' అని అడిగాడు. హలధరుడు తల అడ్డంగా తిప్పాడు. ''లేదు. నేను సైనికుల్ని ఇంక తయారుచెయ్యను'' అన్నాడు. ''అదేమిట్రా చేసి ఇస్తానని వాగ్దానం చేశావు'' అన్నాడు జయశీలుడు కొంచెం కోపంగా. ''అవును. ఆ మాట నాకు జ్ఞాపకం ఉంది. కాని, నేను ఇంక సైనికుల్ని అసలు తయారు చెయ్యనే చెయ్యను'' అన్నాడు కచ్చితంగా హలధరుడు.

''అదేమిట్రా తెలివితక్కువ వెధవా?'' అన్నాడు విసుగెత్తిపోయి జయశీలుడు. ''అయితే చెపుతా విను. మీ సైనికులు ఒక మనిషిని చంపేశారు. నేను ఒక రోజున పొలం దున్నుతున్నాను. ఒక శవాన్ని కొందరు మోసుకొనిపోతున్నారు. దాని వెనుకపాటుగా లబోదిబోమంటూ ఒకావిడ ఏడుస్తోంది. 'ఎవరు ఈ చచ్చిపోయింది? ఏమి జబ్బు చేసింది?' అని అడిగాను ఆవిణ్ణి. ఆమె ఏడుస్తూనే 'నా భర్త. జబ్బేమి లేదు. జయశీలుడి సైనికులు యుద్ధంలో చంపేశారు' అని మరింత మొత్తుకుంది. సైనికులు చక్కని పాటలు పాడతారనుకొన్నాను. అంతేకాని యుద్ధాలు చేసి నిండు ప్రాణాల్ని బలిపుచ్చుకుంటారనుకోలేదు. నీకెన్నటికీ సైనికుల్ని తయారుచేసి ఇవ్వను. ఇంతకుముందు చేసి ఇవ్వడమే పొరపాటయింది'' అని కచ్చితంగా అన్నాడు హలధరుడు. ఆ మాటమీదన్నే నిలబడ్డాడు. జయశీలుడు వచ్చినదారినే తిరిగి వెళ్ళాడు.

తర్వాత హలధరుడి దగ్గరకు ధనశీలుడు వచ్చాడు.

''మరికొంత బంగారం తయారుచేసి ఇయ్యి. చాలా అవసరంలో ఉన్నాను'' అని అప్యాయత వెళ్ళబోస్తూ అడిగాడు. హలధరుడు ధనశీలుడి మాటకు కూడా తల అడ్డం తిప్పాడు. ''నేను ఇవ్వనుగాక ఇవ్వను'' అన్నాడు. ''కావాలంటే ఇంకా చేసి ఇస్తాను. వచ్చి అడుగు అన్నావు

కదరా!'' అన్నాడు ధనశీలుడు. ''అవును. అప్పుడు అలాగే అన్నాను. కాని నాకు నా తప్పు తెలిసివచ్చింది. అప్పుడు నీకు బంగారం చేసి ఇవ్వ డమే పొరపాటు అందుచేత నీకు ఇంక బంగారంచేసి ఇవ్వను. తెలి సిందా?'' అన్నాడు కచ్చితంగా హలధరుడు. ''మాట తప్పుతావేమిరా రెండునాల్కల శిఖండీ! ఇప్పుడు కొత్తగా ఏమి తెలిసిందిరా నీకు'' అన్నాడు ధనశీలుడు. కోపం ఆపుకోలేక ''నీ మొహిరీలతో మన గోపన్న ఆవుని లాక్కొనిపోయారు నీ మనుష్యులు. అందుచేత....'' అన్నాడు హలధరుడు. ''అదేమిట్రా దానికీ దీనికీ సంబంధం ఏమిటి? నీకు మతిగాని పోలేదుకదా?'' అన్నాడు ధనశీలుడు.

''ఏమో నాకేం తెలుసు. ఒకవాడు గోపన్న పెళ్ళాం చంటిబిడ్డకు పాలు లేవని మన ఇంటికి వచ్చింది. మీ ఆవేమైంది? పాలు ఇవ్వకుండా తన్నిందా? అని అడిగాను. లేదు. 'మీ ధనశీలుడి మనుష్యులు వచ్చిపడి మొహిరీలు ఇచ్చారట. వాటి మోజులో పడి మా పిల్లలతండ్రి నిక్షేపం లాంటి పాడిఆవుని అమ్మేశాడు. నిన్నటినుంచి నానాయాతనగా ఉంది' అని చెప్పింది. నీవు ఆ మొహిరీలతో చంటిపిల్లలకు పాలిచ్చే ఆవును లాగేసుకుంటావనుకోలేదు నేను. ఏమైనాసరే నీవు ఏమనుకొన్నా సరే నేను నీ కెప్పుడూ బంగారం చేసి ఇవ్వను.'' అని హలధరుడు నిర్మొగ మోటంగా చెప్పాడు. ఆ మాటమీదనే నిలబడ్డాడు. ధనశీలుడు కూడ నిరాశతో వెనక్కి తిరిగిపోయాడు.

జయశీలుడూ, ధనశీలుడూ తిరిగి మరొకసారి కలుసుకొన్నారు. తమ అనుభవాలు ఒకరితో ఒకరు చెప్పుకొన్నారు. హలధరుడి తెలివి తక్కువతనాన్ని ఆడిపోసుకొన్నారు. మనం ఇద్దరమూ ఒకరికొకరు

ఆసరా కావాలి అని అనుకొన్నారు. వారిలో వారు ఒక ఒప్పందం చేసుకొన్నారు. జయశీలుడు ధనశీలుడుకి అర్ధరాజ్యాన్ని సగం సైన్యాన్ని ఇచ్చాడు. ధనశీలుడు జయశీలుడికి తన ఐశ్వర్యంలో పంచి ఇచ్చాడు. ఇద్దరూ రాజులై ధనవంతులై తమ తమ సేనలతో రాజ్యాలు ఏలుకొంటూ సుఖంగా వైభవంగా ఉన్నారు.

# 8. హలధరుడు కూడా రాజు అయినాడు

హలధరుడిలో ఏమీ మార్పులేదు. తల్లితండ్రుల్ని సేవించుకుంటు న్నాడు. చెల్లెలు మాధవిని ఆదరిస్తున్నాడు. అసామాన్యమైన వరాలు పొందినా పాటుపడి పొట్టపోసుకుంటూ, హాయిగా ఉన్నాడు. అతన్ని ఒక కుక్క ఆశ్రయించింది. అది ఎండనక వాననక అతనితోపాటు తిరుగుతూ ఉండేది. అందుచేత అతనికి ప్రీతిపాత్రమైంది. కాలవశం అది ముసలిదై జబ్బుపడి చచ్చేటందుకు సిద్ధమైంది. హలధరుడు దాని మరణయాతన చూడలేక జాలిపడ్డాడు. ఏమి చెయ్యడమా అని తీవ్రంగా ఆలోచించాడు. అతనికి ఎన్నాళ్ళనుంచో తనదగ్గర ఉన్న వేరుముక్కల సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే వెదికి ఒకవేరుముక్కని పెరుగు అన్నంతో ఆ కుక్కకి తినిపించాడు. అది ఆ వేరుముక్కను మెల్లిగా నమిలి మింగింది. వెంటనే దాని రోగం ఎకడికక్కడ మటుమాయమైంది. ఆప్యాయత వెల్లడించేలాగ తోకాడిస్తూ హలధరుడి చుట్టూ తిరిగి ఆటలాడ సాగింది.

హలధరుడి తల్లిదండ్రులు అది చూసారు. "ఏదైనా మందువేశా వేమిటిరా కుక్కకి" అని అడిగారు. అవును; నా దగ్గర ఏ రోగాన్నైనా కుదిర్చే వేరుముక్కలు రెండు ఉన్నాయి. ఒకటి దీనికి తినిపించాను. ఇన్నాళ్ళు ఆ వేరుముక్కను జాగ్రత్త పెట్టినందుకు సమయానికి ఉప యోగపడింది" అన్నాడు తృప్తి వెల్లడిస్తూ.

వీళ్ళిలా మాట్లాడుకుంటూ ఉంటే ఒక దండోరా వినిపించింది.

''రాజుగారి కూతురు చాలా సంవత్సరాలనుంచి ఏదో జబ్బుతో తీసుకుంటోంది. ఎంతమంది వైద్యులో వైద్యం చేసారు. లాభంలేదని మానుకొన్నారు. ఆమెకు ఎవరేనా సరే ఏదైనా మందో మాకో ఇచ్చి కుదర్చవచ్చు. రాజుగారు వారికి ఆమెని ఇచ్చి పెళ్ళిచేస్తారు. రాజుగారి తదనంతరం ఆయన అల్లుడే రాజు అవుతాడు. ''హలధరుడి తల్లికూడా ఈ చాటింపు వింది. చాలా సంతోషించింది.

''నాయనా! నీ దగ్గర ఇంకా ఒకవేరుముక్క ఉందికదా! దాన్ని రాజకుమారికి ఇయ్యి. ఆమెకు ఆరోగ్యం లభిస్తుంది. నీ అదృష్టం పండి నీవుకూడా హాయిగా ఉంటావు.'' అని ఆమె కొడుకుతో చెప్పింది. హలధరుడు 'సరే' అని ప్రయాణం కట్టాడు. అతను కుక్కను బ్రతికించిన సంగతీ, అతనిదగ్గర సర్వరోగనివారిణి అయిన వేరుముక్క ఉన్నదనే సంగతీ. ఆ నోటా, ఆ నోటా వ్యాపించాయి. ఆ ఊరిలోనే పక్షవాతంతో ఒక చెయ్యీ, ఒక కాలూ పడిపోయిన ఒక ముసలి అవ్వకు తెలిసింది. ఆమె హలధరుణ్ణి వెతుక్కొంటూ వచ్చింది. ప్రయాణమై గుమ్మంలోకి వచ్చిన హలధరుణ్ణి చూచింది. ''నాయనా! నీ దగ్గర ఏదో మందు ఉందట. అదిటిదాన్ని. నా పనులు నేను చేసుకోలేకపోతున్నాను, నాకు ఆ మందు ఇయ్యి. నీ పేరు చెప్పుకొంటూ సుఖంగా బతుకుతా'' అంది.

హలధరుడికి ఎంతో జాలివేసింది. ''సరే అవ్వా! ఇదిగో తీసుకో. నీవు హాయిగా ఉండాలనే నా కోరిక.' అంటూ తన దగ్గర ఉన్న వేరుముక్క ఇచ్చి నమిలి మింగమన్నాడు. ఆమె అట్లాగే చేసింది. వెంటనే ఆమెకూ కాళ్ళూ చేతులూ స్వాధీనమైనాయి. నాయనా వెయ్యేళ్ళు వర్ధిల్లు.'' అంటూ హలధరుణ్ణి దీవిస్తూ ఆమె తనదారిని తాను వెళ్ళింది.

హలధరుడు తృప్తిగా సంతోషంగా ఆమె వెళ్ళినదారికేసి చూస్తు న్నాడు. ఇంతలో ఈ సంగతి హలధరుడి తల్లి విన్నది. ఇంట్లోంచి వచ్చింది. "ఏమిరా తెలివితక్కువ సన్నాసీ! అమూల్యమైన మందు ముక్కూ మొగమూ తెలియని ముసిలిదానికిచ్చావా? రాజకుమార్తెకంటె ఆ ముసలిదే ఎక్కువ అనుకున్నావా? కాస్త మంచీ చెడ్డా, లాభం నష్టం ఆలోచించనక్కలేదా? చేతికి వచ్చే రాజ్యం చెయ్యి జారి పోయింది. ఇంకా ఎందుకు రాజుగారిదగ్గరకు ఈ ప్రయాణం చేతులు జాడించుకొంటూ వెళ్ళి ఏం చేస్తావు అక్కడే" అంటూ మందలించింది.

హలధరుడికి రాజకుమార్తెమీద కూడా జాలి కలిగింది. ఆమెని చూసివద్దామని అనిపించింది. "వెంటనే వెళ్ళి వస్తా" అన్నాడు. తల్లి "ఎక్కడికిరా?" అని అడిగింది. "రాజకుమార్తె ఎలాగుందో చూసి వస్తా" అని జవాబు చెప్పాడు హలధరుడు. నీ దగ్గర మందులేదు కదరా మరి. ఊరికే చూసి నీవేమి చెయ్యగలవు? అంది తల్లి. "ఫరవాలేదులే. చూసి రావడానికేమీ అడ్డులేదు కదా;" అన్నాడు హలధరుడు చిరునవ్వు నవ్వుతూ. "అయితే మంచిది క్షేమంగా వెళ్ళి లాభంగా రా" అని ఆ అమాయికపు తల్లి కొడుకుని దీవించి పంపింది.

హలధరుడు రాజుగారి కోటకు వెళ్ళాడు. "రాజకుమార్తెను చూద్దామని ఉంది" అన్నాడు. రాజుగారి కుమార్తె జ్వరం తీవ్రంగా ఉంది. హలధరుడు గుమ్మం దాటి కోట లోపల ప్రవేశించాడు. ఆమె జ్వరం దిగజారింది. హలధరుడు గదిలోకి వెళ్ళాడు. ఆమె లేచి కూర్చుంది. నమస్కరించి "తమ దయవల్ల నాకు ఆరోగ్యం లభిం

చింది. ఇంక నా భారం తమదే'' అన్నది. రాజుగారు కూడా తన మాట నిలబెట్టుకొన్నాడు. హలధరుడు రాజుగారి అల్లుడైనాడు. అతని వివాహం ఎంతో వైభవంగా జరిగింది. ఆ ఆడంబరాలన్నింటినీ హలధరుడు ముళ్ళమీద కూర్చున్నట్లుగా సహించాడు. పెండ్లి వేడుకలన్నీ పూర్తి అయ్యాయి. తర్వాత కొద్ది రోజులకు వృద్ధ రాజు లోకాంతరగతుడు అయాడు. హలధరుడు రాజయాడు. ఈ రీతిగా ముగ్గురు అన్న దమ్ములూ మూడు దేశాలకు పరిపాలకులు అయారు.

# 9. రైతురాజు హలధరుని పరిపాలన

ముగ్గురు అన్నదమ్ములూ మూడు రాజ్యాలు పరిపాలిస్తున్నారు. జయశీలుడి పని బాగుంది. హలధరుడు సృష్టించి ఇచ్చిన సైనికులకు తోడుగా మరెంతో మందిని సైన్యంలో చేర్చాడు. తన రాజ్యంలో ప్రతి కుటుంబంనుంచీ కనీసం ఒక్కడైనా సైన్యంలో చేరాలని నియమం చేశాడు. సైన్యంలో చేరిన ప్రతివారూ తగినంత ఒడ్డూపొడుగూ, బలమూ కలవారే. వారందరికీ అతను మంచి శిక్షణ ఇచ్చాడు. అతని మాటకు ఎదురులేదు. తనకి ఎదురు చెప్పిన వాళ్ళమీదికి సైనికుల్ని పంపేవాడు. వారిని పూర్తిగా నాశనం చేసేవాడు. మొత్తంమీద జయశీలుడి పని హాయిగానే ఉంది. అతని సైనికులే అతనికి కావలసినవన్నీ సాధించి తెచ్చి ఇచ్చేవారు. అతని కోరికలన్నీ తీర్చేవారు. కాని, అతని రాజ్యంలో ప్రజలు మాత్రం చెరలో ఉన్నట్లు అనుకొనేవారు. మెడమీద ఎవరో కత్తి మోపి ఉంచినట్లు బెదురుతూ కాలం గడుపుతూ ఉండేవారు.

ధనశీలుడు కూడా సౌఖ్యంగానే ఉన్నాడు. హలధరుడు ఇచ్చిన బంగారాన్ని అతడు మొదట్లో రకం తిప్పేటందుకు వాడాడు. లాభాలు రాగానే దాన్ని కదపనక్కరలేకపోయింది. దాన్ని అట్లాగే ఉంచి వృద్ధి చేశాడు. లక్ష్మి ఇనప్పెట్టెల నిండా మూలుగుతోంది. ధనశీలుడు రాజు కాగానే తన దేశంలోని రాబడి పద్ధతులను తీర్చిదిద్దాడు. పకడ్బందీగా పన్నులు వసూలుచేసే పద్ధతులు అమలుచేశాడు. రోడ్డుమీద నడిచేవారిమీద పన్ను, బండ్లమీద పన్ను, చెప్పులమీద పన్ను, మేజోళ్ళమీద పన్ను,

బట్టలమీద పన్ను. ఇట్లాగ ఒకటేమిటి అన్నింటిమీదా, అందరిమీదా పన్నులే. ఏదైనా కొన్నా పన్నే, అమ్మినా పన్నే. పెళ్ళి చేసుకొన్నా పన్నే, పిల్లలు పుట్టినా పన్నే, చివరికి చచ్చినా పన్నే. వీటన్నింటి మూలంగా ధనశీలుడి ఖజానా ఎప్పుడూ నిండుగా ఉండేది. అతనికి ఏ లోటూ లేదు. సొమ్ము ఉంటే కొండమీది కోతి కూడా దిగివస్తుంది అనే మాట నిజమైంది. దేశంలోని జనం అందరూ అతనికి ఏదో విధంగా సేవకులూ, జీతగాళ్ళూ అయ్యారు.

హలధరుడి పనికూడా బాగానే ఉంది. కాని అతని దారి వేరుగా ఉంది. మామగారి తర్వాత హలధరుడు రాజు కాగానే డాబుసరిగా ఉన్న తన జరీబట్టలు విప్పివేశాడు. వాటిని తీసి పెట్టెలో పెట్టమని భార్య కిచ్చాడు. "నాకు తోచటంలేదు. బొజ్జ పెరుగుతోంది. ఆకలి మందగించింది. నిద్ర సర్గ్గా పట్టడంలేదు. ఇక్కడికి వచ్చినప్పటినుంచే నాకు తగినంత పనిలేదు. నా పాతపద్ధతులనే నేను తిరిగి అవలంబిస్తాను. హాయిగా ఉంటుంది." అనుకొన్నాడు. ఈ రీతిగా ఒక నిశ్చయానికి రాగానే తల్లిదండ్రుల్నీ, చెల్లెల్నీ పిలిపించాడు. తన మామూలు కోరా నేతబట్టలూ ఆకుచెప్పులూ ధరించాడు. ఎప్పటిలాగే పొలం పనులు చేసుకొంటూ ప్రజలతో కలిసిపోయాడు.

హలధరుడి మంత్రులకు ఈ చర్యలు విపరీతంగా కన్పించాయి. "మహారాజా! తమరు ఈ దేశానికి పరిపాలకులు. ఇట్లా నేల తవ్వుతూ కాయకష్టం చెయ్యకూడదు." అని వినయంగా విన్నవించుకొన్నారు. ఎంత రాజు అయితే మాత్రం తిన్న తిండి జీర్ణం చేసుకోనక్కరలేదా?" అని గద్దించాడు హలధరుడు. ఆర్థికమంత్రి వచ్చి "పరివారానికి జీతాలిచ్చేటందుకు ఖజానాలో సొమ్ములేదు మహారాజా" అన్నాడు.

''అయితే ఇవ్వకండి'' అన్నాడు హలధరుడు.

''జీతా లివ్వకపోతే వాళ్ళు పనులు మానేస్తారు'' అన్నాడు మంత్రి.

''అట్లాగైతే సరీ మంచిది. ఎవళ్ళ పొలం పనులు వాళ్ళు చేసుకుంటారు. ఊళ్ళో ఎక్కడా చెత్తాచెదారమూ ఉండదు. అదంతా వారిపొలాల్లో పెంట తోలుకుంటారు' అన్నాడు నిర్వికారంగా హలధరుడు. చివరికి అట్లాగే జరిగింది. రాజుగారి పరివారం అంతా ఎవరి పొలాలు వాళ్ళు వ్యవసాయం చేసుకోసాగారు.

ఒకసారి హలధరుడి సభలో ఒక కేసు విచారణకు వచ్చింది.

''వాడు మా గాదెలోనుంచి రెండు బస్తాల ధాన్యం దొంగిలించాడండి'' అన్నాడు ఫిర్యాదీ.

''ఇంకా ఎన్ని మిగిలాయి నీ గాదెలో'' అని అడిగాడు హలధరుడు.

''అరవై డెబ్బయి ఉంటాయి'' అని చెప్పాడు ఫిర్యాదీ.

''అట్లాగా ! అయితే నీకేం ఫరవాలేదు. వాడికి ఆ రెండుబస్తాలూ తిండికి అవసరం అయినాయి ; కాబోలు ఆకలి బాధకు తట్టుకోలేక అట్లా చేశాడనుకుంటా'' అని ''ఏమిటి నీ సంజాయిషీ'' అని నేరస్థుణ్ణి అడిగాడు హలధరుడు.

''వారం రోజులనుంచి నాకు పని దొరకలేదు. మా యింటిలో అందరికీ తిండిలేదు. అందుచేత జరిగిందీ పొరపాటు. నన్ను మన్నిం

పండి బాబూ'' అన్నాడు ఆ నేరస్థుడు. ''చూశావా ? నేను అన్నది నిజమే కదా !'' అని ఫిర్యాదికేసి హలధరుడు గర్వంగా చూశాడు. తర్వాత నేరస్థుడివైపు తిరిగి ''ఎప్పుడూ ఇట్లా చెయ్యకు. వ్యవసాయం చేసి పండించుకొని తిను'' అని కొంత బంజరుభూమి ఇచ్చాడు.

ప్రజలందరూ హలధరుడు విపరీతపు రాజు అనుకొన్నారు కొందరు తెలివితక్కువ వాడన్నారు కొందరు చేతకాని వాడన్నారు మరికొందరు ''ఇతడు కర్మయోగంతో రాజయోగం మేళవించిన వేదాంతి'' అన్నారు. ఇట్లాంటి రకరకాలమాటలు అన్నీ విని హలధరుడి భార్య నవ్వింది. ఒకనాడు భర్తదగ్గరకు వెళ్ళింది. '.మహారాజా ! మిమ్మల్ని కొందరు అవ్యక్తుడు అంటున్నారు. మరికొందరు ''దేశంలో రాజు అందరిదీ ఓకదారీ మీటక్క రిదీ ఓకదారీ అంటున్నారు ఆ మాటలు అవి వింటే ఎంతో బాధగాఉంది'' అని చెప్పింది.

''బాగుంది, నేను వారి దృష్టిలో అవ్యక్తుడ్ని అయితే కావచ్చు కాని ఇదే నా దారి. ఇదే నా జీవిత విధానము. ఈ దారిని వదిలపెట్టను. ఇదే నాకు హాయి. ఇది నీకు నచ్చకపోతే బలవంతంలేదు. నీకు అలవాటైన పాత పద్ధతిలోనే నీవు ఉండవచ్చు'' అన్నాడు.

''ఆమె తనలోతాను బాగా ఆలోచన చేసుకున్నది.

''సూదితో పాటే దారమూ. భర్త నడిచినదారే భార్యది'' అని నిశ్చయించుకొన్నది. వెంటనే ఆమెకూడా తన జరీచీరెల్ని తీసి పారవేసింది. నేతచీరెలు ధరించింది. ఆడబడుచైన మాధవికి, పనీపాటలలో ఆసరా కాసాగింది. హలధరుడికి చేదోడైంది.

లోకజ్ఞులమూ, తెలివైనవాళ్ళమూ అని అనుకొనేవారు అందరూ

హలధరుడి రాజ్యంనుంచి వెళ్ళిపోయారు. కాయకష్టం చేసుకొంటూ పొట్ట పోసుకొనేవారు మాత్రమే మిగిలారు. ఆ రాజ్యంలో ఆఫీసులూ, ఆఫీసర్లూ, పన్నులూ వసూళ్ళూ లేవు. నేరాలూ విచారణలూ లేవు. ఆశ, అసూయ, అహంకారమూ హలధరుడి రాజ్యంలోకి తొంగిచూడలేదు. ఆ దేశంలో పండించిన పంటను అందరూ తమ తమ అవసరాన్నిబట్టి అనుభవించేవారు. రోగాలూ రొష్ఠులూ అనేవి లేకుండా హాయిగా కాలం గడుస్తోంది.

## 10. కలిమహారాజు పన్నాగాలు

కలి మహారాజు తన అనుచరులకోసం ఎదురుతెన్నులు చూడసాగాడు. వారెంతకూ తిరిగిరాలేదు. "వారికేదో ప్రమాదం జరిగింది కాబోలు ఇక నేనే స్వయంగా కలుగజేసుకోవాలి" అని బైలుదేరాడు. జయశీలుడు, ధనశీలుడు, హలధరుడు కన్పించలేదు. దివ్యదృష్టితో చూస్తూ వెతికాడు. వాళ్ళు ముగ్గురూ సుఖంగా మూడురాజ్యాలు ఏలుతూ ఉన్నారు. పేసి వెయ్యకుండా వైభవంగా ఉన్నారు. కలి మహారాజు కంటి నిప్పులు కురిశాయి. "సరే వీళ్ళపని పట్టాలి" అని అనుకొన్నాడు.

కలి మహారాజు సేనాధిపతిలాగ మారువేషం ధరించాడు. జయశీలుడి ఆస్థానంలోకి వెళ్ళాడు. "రాజా! నీవు మహావీరుడవనీ. వీరుల్ని ఆదరిస్తావనీ విన్నాను. నాకు సేనల్ని నడిపించడంలోని పద్ధతులన్నీ తెలుసు. జయం సాధించే యుక్తులెన్నో తెలుసు. నీ కొలువు చేద్దామని వచ్చాను" అన్నాడు.

జయశీలుడు ఈ కొత్త సేనానాయకుణ్ణి రణవిద్యలో పరీక్షించాడు. గట్టివాడని నిశ్చయించాడు. తన సేనలన్నింటికీ నాయకుడుగా చేశాడు.

వెంటనే కలిమహారాజు "మనం సైనికబలం పెంచాలి జబ్బపుష్టి

కల వారందరూ సైన్యంలో చేరాలని ఆజ్ఞాపించండి. అందుమూలంగా సైన్యం అయిదురెట్లు అవుతుంది. కొత్తరకం తుపాకులు తెప్పించాలి, వాటితో చిత్తజల్లుగా తుపాకీగుళ్ళను వర్షించడం శత్రుసైనికుల శరీరాన్ని తూట్లు తూట్లుగా కొట్టడం సాధ్యమవుతుంది. కొత్తరకం మరఫిరంగుల్ని తెప్పించాలి. వాటితో అగ్నిజ్వాలల్ని కల్పించవచ్చు. శత్రుసేనల్ని, వాళ్ళ ఊళ్ళను భస్మీపటలం చెయ్యవచ్చు'' అని సలహాలు ఇచ్చాడు.

ఈ సలహాలన్నింటినీ జయశీలుడు అక్షరాలా పాటించాడు. అతని రాజ్యంలో మందుగుండు సామానులూ, తుపాకులూ, మరఫిరంగులూ తయారుచేసే ఫాక్టరీలు ఎన్నో వెలిశాయి. రాజ్యం అంతా ఒక సైనిక శిబిరం అయింది.

ఈ సమర సన్నాహాలు పక్కనేఉన్న మళింద దేశపురాజు చారుల ద్వారా విన్నాడు. హడలిపోయాడు వెంటనే జయశీలుడుకి ఈ రీతిగా రాయబారం పంపాడు. ''నన్ను సామంతరాజుగా అంగీకరించవలసింది. శత్రురాజుల దాడినుంచి మమ్మ రక్షించే బాధ్యత స్వీకరించండి'' జయ శీలుడి సంతోషం హద్దులన్నింటినీ దాటింది. దెబ్బ కొట్టకుండానే జయం వచ్చి వరించింది ఆ రాయబారానికి అంగీకరించాడు. తన కొత్త సేనాధి పతి సలహా మంచిదని మెచ్చుకొన్నాడు మరింత గర్వించి పల్నాడు పరి పాలించే రాజుదగ్గరికి ''మీరు మమ్మ సార్వభౌములుగా అంగీకరించండి. మా సామంతరాజులుగా మీకు రక్షణ ఇస్తాము. లేదా మీ దేశంమీదికి దండెత్తివస్తాము'' అని సందేశం పంపాడు.

జయశీలుడికి పల్నాటిసంగతి తెలియదు ఆ రాజు జయశీలుడికంటె మూడాకులెక్కువ చదివాడు అతని దేశంలో యువకులేకాదు, యువతులు కూడా పొడుగ్గా ఉంటారు. కాయకష్టంతో రాటుదేరి ఉంటారు. అగ్ని

గోళాలు తయారుచెయ్యడం, గురి తప్పకుండా విసరడం దేశంలో అందరికీ తెలుసు. జొన్నచేలలో వాలిన పిట్టలమీద నిత్యం వడిసెల రాళ్ళు విసురుతూ ఉండటంచేత వారికి అది బాగా చెయ్యితిరిగిన విద్య. ఆ దేశంలో పసిపిల్ల బాలాదిగా అందరూ స్వాతంత్ర్యయోధులే. వేరే సైనికులనేవారు లేరు. అందుచేత జయశీలుడి రాయబారం విని ఆ రాజు నవ్వాడు. ''మా దేశం ఎవరిమీదికీ దండెత్తిపోదు. మేము ఎవరికీ తల వంచము. కండకావరమెవ్వరికీ కూడదు. పోయి ఈ మాటలే మీ రాజుతో చెప్పు''.

ఈ జవాబు విని జయశీలుడు మండిపడ్డాడు. తన సైన్యాన్ని పల్నాటిమీదికి నడిపించాడు. ఈ ప్రచండ సైన్యం పల్నాటి పొలిమేరలకు చేరింది. వెంటనే వాడిమీద ఎంతో దూరంనుంచి అగ్నిగోళాలవర్షం కురిసింది. చిత్తజల్లు తుపాకుల్నీ, మరఫిరంగుల్నీ ఉపయోగించే అవకాశమే వారికి కలగలేదు. జయశీలుడి సైనికులందరూ ఎక్కడి వారక్కడ భస్మీపటలమయ్యారు. హతశేషులే లేరు.

దాహం-మంటలు-పరాభవం- సహించలేను అంటూ ఘోషిస్తూ జయశీలుడి ఆత్మ గాలిలో అంతటా తిరుగుతోంది.

కలిమహారాజు తృప్తిపడ్డాడు.

'జయశీలుడి పని పూర్తి అయింది. ఇక ధనశీలుడి పని పట్టాలి' అని కలిమహారాజు ప్రయాణమై వెళ్ళాడు. వర్తకుడి వేషం వేసుకొన్నాడు. ధనశీలుడి రాజ్యంలో ప్రవేశించాడు. ఒక దుకాణం పెట్టాడు.

"మీరు ఏదైనా అమ్మతారా ?
అయితే మా దుకాణంలోకి రండి !
మీకు నచ్చిన ధర పుచ్చుకోండి !"

అని బోర్డు కట్టాడు. ప్రజలు ఏది అమ్మినా ఇతనికే అమ్మసాగారు. ప్రతీదీ వాళ్ళు చెప్పిన ధర ఇచ్చి కొంటున్నాడు. 'మరొకరికి అమ్మేకంటె ఈ కొత్త వర్తకుడికి అమ్మితే లాభం. రెట్టింపు ధర వస్తుంది' అనే వాడుక ఏర్పడింది. రాజుగారికి కట్టవలసిన పన్నులు బకాయి లేకుండా వసూలు అవుతున్నాయి. 'ఇదీ ఒక విధంగా బాగానే ఉంది' అనుకొన్నాడు ధనశీలుడు. 'కొత్త పంపిణీమీద ఒక మేడ కట్టించుకోవాలి' అనుకొన్నాడు ధనశీలుడు. దీనికి ప్లాన్‌లు తయారయ్యాయి. పునాదులు లేచాయి. ఈలోగా కొత్త షావుకారు 'తాను కూడా ఒక మేడ కట్టించుకోవాలి' అని తీర్మానించుకొన్నాడు. ఎక్కడెక్కడి సామానులూ అతనే కొనేశాడు. ధనశీలుడి మేడ కట్టడం పని ఆగిపోయింది. కొత్త షావుకారు ఆహారపదార్థాలు అన్నీ కొనేశాడు. ధనశీలుడికి ఎవ్వరూ ఏదీ అమ్మటం లేదు. మానివేశారు. ఎప్పుడో కొన్నని ఖర్చుఅయిపోయాయి. ఇల్లు ఖాళీ అయింది. ఖజానాలో అంతులేని బంగారం మూలుగుతోంది. కాని, అతనికి ఉప్పుపప్పూ, అన్నమూ కరువైనాయి. ఆకలితో మాడుతున్న ధనశీలుణ్ణి చూసి పాపమని అన్నవారే లేరు. 'ధనశీలుణ్ణి కొనేస్తాను నేను' అని కొత్త షావుకారు మాటవరసకు అన్నట్లు అన్నాడు. ఆ మాట ధనశీలుడికి చేరింది. వెంటనే కొత్త షావుకారుని తన రాజ్యంలోనుంచి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు. 'సరే' అని కొత్త షావుకారు వెళ్ళిపోయాడు. అతను ఎక్కడికీ దూరం వెళ్ళిపోలేదు. పక్క రాజ్యంలో

ధనశీలుడి రాజ్యం సరిహద్దులో తన వ్యాపారం ఏర్పాటు చేసుకొన్నాడు. అందుచేత ధనశీలుడి స్థితిగతుల్లో ఏమీ మార్పు రాలేదు. అతను ఆకలి బాధకు తాళలేకపోయాడు. 'లక్షాధికారైన లవణ మన్నమె కాని మెరుగు బంగారంబు మ్రింగబోడు' అని ఆకలితో, పశ్చాత్తాపంతో ప్రాణాలు వదిలాడు. ధనశీలుడి ఆత్మ ''ఆకలి – బంగారం – ఆకలి – ఆశ – దురాశ – దుఃఖం'' అంటూ అశాంతితో ఘోషిస్తూ విశ్వమంతటా తిరుగుతోంది.

కలిమహారాజు తృప్తిపడ్డాడు.

# 11. రైతురాజ్యంలో కలిమహారాజు పరాభవాలు

కలిమహారాజు రెండు ఘట్టాల్లో విజయం లభించినందుకు సంతోషించాడు. హలధరుడి దగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నాడు : ''చతురంగబలం లేని రాజు రాజు కాదు. అందుచేత మీరు అనుజ్ఞ ఇవ్వండి. ప్రజలను సైన్యంలో చేరుస్తాను. వారికి తగిన తరిఫీదు ఇస్తాను.'' అని మనవి చేశాడు. ''అవును. నీవన్న మాట బాగానే ఉంది. సైనికుల్ని చేర్చి వాళ్ళకి బాగా పాటలు చెప్పు. డ్రిల్లు చేయించు. నాకు పాటలు వినడం అంటే సరదా. సైనికులు బారులుతీరి నడుస్తోంటే చూచేటందుకు బాగుంటుంది.'' అన్నాడు హలధరుడు. 'హలధరుడి దగ్గరనుంచి అపాటి మాట వచ్చింది కదా ! చాలు.' అని కలిమహారాజు ప్రజలను 'సైన్యంలో చేరండి; రండి !' అని ప్రచారం చెయ్యసాగాడు. ఎక్కడికి వెళ్ళినా 'జనం సైన్యంలో చేరితే మాకేమి లాభము ?' అని ప్రశ్నించసాగారు. 'హాయిగా భోజనం చెయ్యవచ్చు. మంచి దుస్తులు వేసుకోవచ్చు.' అని ఈ కొత్త సేనానాయకుడు ప్రలోభం కలిగించబోయాడు. 'ఓశ్, ఇంతేనా ? మేమూ మా ఇంటి దగ్గర రోజూ హాయిగానే భోంచేస్తూ ఉన్నాము. ఇంక దుస్తులు అంటావా మా రాట్నాలమీద నూలుతీసి నేయించుకొంటూనే ఉన్నాము. అందుచేత మేమెవ్వరమూ సైన్యంలో చేరము.' అన్నారు. కలిమహారాజు మళ్ళీ హలధరుడి దగ్గరకు వెళ్ళాడు.

'ఓ రాజా! నీవు నీ ప్రజలు ఉద్ధ తెలివితక్కువవాళ్ళు, వాళ్ళంతట వాళ్ళు సైన్యంలో చేరేటట్లు లేరు. మీరు తప్పదని ఆజ్ఞాపించాలి' అని చెప్పాడు. 'అలాగా? అయితే సరే ఆ తంటాలేవో నీవే పడు' అన్నాడు హలధరుడు. 'యువకులు అందరూ సేనలో చేరాలి. సేనలో చేరని వాళ్ళకు మరణశిక్ష విధింపబడుతుంది' అని రాజుగారు ఆజ్ఞాపిస్తున్నారు' అని కొత్త సేనానాయకుడు ప్రకటించాడు. 'సరే అయితే మేము సైన్యంలో చేరితే యుద్ధం వచ్చినప్పుడు మా గతేమవుతుందో చెప్పు. సామాన్యంగా యుద్ధంలో సైనికులు మరణిస్తారు అని విన్నాము' అని ప్రజలు ఆ కొత్త సేనానాయకుణ్ణి నిగ్గదీసి అడిగారు.

'అవును. మీరు విన్నమాట నిజమే. అలాగే జరుగుతూఉంటుంది. అప్పుడప్పుడు సైనికులకు రణరంగంలో మరణం తప్పదు. అది వీరోచితము వీర స్వర్గానికి దారి.' అని ఉత్సాహం కల్పించేందుకు అన్నట్లుగా అన్నాడు. ఈ సమాధానం వినగానే మేము సైన్యంలో చేరనేచేరము. ఏమైనా సరే మాకెలాగైనా చావే కదా! ఆ చావేదో ఇంటిపట్టునే ఉండి చస్తాము.' అన్నారు మొండిపట్టుపట్టి ప్రజలు అందరూ ఏకవాక్యంగా.

'ఓరి తెలివితక్కువ వాజమ్మల్లారా! యుద్ధానికి వెళ్ళిన సైనికులు చస్తే చావవచ్చు, లేదా తప్పించుకోవచ్చు. కాని సేనలో చేరకపోతే మాత్రం రాజుగారి చేతుల్లో మీకు చావు తప్పదు' అన్నారు కలిమహారాజు.

ప్రజలలో గగ్గోలు పుట్టింది. గుంపులు గుంపులుగా హలధరుడి దగ్గరకు వెళ్ళారు. 'మహారాజా! మా బతుకులు మేం బతుకుతున్నాము. 'సేనలో చేరండి. లేకపోతే మీకు రాజుగారు మరణశిక్ష విధిస్తున్నారు.' అంటున్నాడు ఒకమనిషి ఈ మధ్య మమ్మల్ని బెదిరిస్తున్నాడు. ఈ

మాటలు నిజమేనా?' అని కచ్చితంగా సూటిగా అడిగారు. హలధరుడు నవ్వాడు. 'నాకూ అదే అర్థం కావడంలేదు. ఎవరో ఒక కొత్త మనిషి వచ్చాడు. మీకు సేన ఉంటే మంచిది' అన్నాడు. నేను 'సరే' అన్నాను. సేనలో చేర్చినవారికి కొత్తకొత్త ఆటలూపాటలూ నేర్పు అన్నాను. వాడే మళ్ళీ వచ్చి 'ప్రజలు సేనలో చేరడంలేదు. చేరక తప్పదు' అని ఆజ్ఞా పించండి అన్నాడు. 'ఆ తంటాలేవో నీవే పడు!' అన్నాను. 'సేనలో చేరడం చేరకపోవడం మీ ఇష్టము. చేరకపోతే, నేనొక్కణ్ణి మీ అందరికీ ఎట్లా మరణశిక్ష విధించగలను? అదెట్లా సాధ్యమవుతుంది?' అని అన్నాడు. 'అట్లా అయితే మేం సేనలో చేరము. మాకు వచ్చిన ఆటలూ పాటలూ చాలు' అన్నారు ప్రజలు. 'మంచిది. సేనలో చేరాలనే కోరిక లేకపోతే చేరకండి. మిమ్మల్ని ఎవ్వరూ ఏమీ చెయ్యరు. చెయ్యలేరు' అన్నాడు హలధరుడు.

కలిమహారాజుకి మొదటిసారి పరాభవం కలిగింది. 'ఈ పద్ధతి కలిసిరాలేదు' అని తోకముడుచుకొని వెళ్ళిపోయాడు.

కలిమహారాజు తిన్నగా మలకనాటి రాజు దగ్గరకు వెళ్ళాడు. ఆయన సభలో ఇట్లా అన్నాడు: 'హలధరుడి రాజ్యం సుభిక్షంగా ఉంది. ఆ దేశంలో వెండి బంగారాలు లేవు. కాని, పాడిపంటలు విరివిగా ఉన్నాయి. సైన్యం అనేదే లేదు. మీరు మీ సైన్యం నడిపిస్తే సరి. జయం దానంతట అదే వచ్చి ఒడిలో వాలుతుంది. అందుకు నేను పూచీ' అని ప్రోత్సహించాడు.

'అయితే సరే. నేను కాదనను. ఆ సైన్యాన్ని నీవే నడిపించు. సిరి వస్తోంటే వద్దు అని మోకాలొడ్డేటంత వెర్రివాణ్ణి కాను. ఆ రాజ్యం జయించి నా రాజ్యంలో కలుపు' అన్నాడు మలకనాటి మహారాజు.

మలకనాటి సేనలు హలధరుడి దేశంమీదికి నడిచాయి. సేనలు హలధరుడి రాజ్యంలో ప్రవేశించింది. 'ఇంకైనా కాస్త వేడి పుట్టదా!' అని కలిమహారాజు ఆశించాడు. కాని, ఆ రైతురాజు రాజ్యంలో ఎక్కడా సైన్యసమీకరణమే లేదు. పైగా జనం సైనికులికి ఎదురువచ్చి వంతులు వారీగా అతిథిమర్యాదలు చెయ్యసాగారు. విందుభోజనాలకు వెళ్ళినట్లుంది గాని యుద్ధానికి వెళ్ళినట్లనిపించలేదు. శత్రుసేనలు దేశం నడిగడ్డదాకా వచ్చాయి. 'పాపం! వాళ్ళ దేశంలో పంటలు పోయాయి కాబోలు. పోనీ, ఇక్కడే సర్దుకోకూడదా?' అని జనం జాలిపడసాగారు. 'వీళ్ళ పని ఇట్లా కాదు' అని కలిమహారాజు అనుకొన్నాడు. 'వెళ్ళినచోటల్లా పశువుల్ని నరకండి. ఇళ్ళూ, పంటకుప్పలూ కాల్చి విధ్వంసం చెయ్యండి. అప్పుడుగాని వీళ్ళకి మన తడాఖా తెలియదు' అని తన సేనల్ని ఆజ్ఞాపించాడు. వాళ్ళు అట్లాగే చేశారు. అయినా శత్రుసేనలపట్ల ద్వేషం కలగలేదు. 'సిక్షేపంలాంటి పంటనీ, ఇళ్ళనీ ఎందుకు నాశనం చేస్తారు? నోరులేని పశువుల్ని ఎందుకు చంపుతారు? మీకు కావలసినట్లయితే తీసుకోవద్దన్నామా?' అని జాలిపుట్టేలా అనసాగారు. ఎక్కడికి వెళ్ళినా ఈ మాటలే సైనికుల చెవుల్లో పడసాగాయి. సైనికుల మనసులు చెదిరిపోయాయి. హింసాకాండకు వాళ్ళ చేతులు వెనకాడాయి. 'మేం వీరులం. కత్తి దూసి ఎదిరించిన వీరులతో పోరాడుతాం. అంతేకాని మూగజీవాల్ని నరికి, ఎదురుదెబ్బ కొట్టేటందుకు చెయ్యెత్తని సాధు జనుల్ని హింసించే కిరాతకులం కాము. మేమింక నీతో ఒక్క అడుగైనా కలిసి వెయ్యము. నీ దారి నీది. మా దారి మాది' అని సైనికులు అందరూ కలిమహారాజుని వదలి చెల్లాచెదరైపోయారు.

కలిమహారాజొక్కడే మిగిలాడు. ఆయన రెండోసారి కూడా పరాజయం పొందాడు.

# 12. రైతురాజు హాలధరుని ఘన విజయం

కలిమహారాజు ఈమారు మరొక రకం ఎత్తు వెయ్యాలి అనుకొన్నాడు. ధనశీలుడిని నాశనం చేసిన విధానం ఫలిస్తుందేమో చూడాలి అనుకొన్నాడు. వేషం, భాష మార్చాడు. పెద్దమనిషిలాగ హాలధరుడి దగ్గరకు వెళ్ళాడు. 'నేను మీ దేశంలో ఉండిపోతాను. ఇక్కడే ఇల్లు కట్టుకొని వ్యాపారం చేసుకొందామని ఉంది అనుజ్ఞ ఇవ్వవలసింది' అని అడిగాడు. హాలధరుడు 'సరే' అన్నాడు, కలిమహారాజు సంతోషించి తాను కట్టదలచుకొన్న ఇంటి ప్లాన్ చూపించి ప్రజలతో ఇట్లా అన్నాడు: 'మీరంతా ఇరుకుగా కూపాల్లా ఉన్న ఇళ్ళలో పందుల్లాగా, కుక్కల్లాగా నివసిస్తున్నారు. ఇల్లు కట్టించి, ఇల్లు అనేది ఎలా ఉండాలో, మనుషులు ఎట్లా జీవించాలో చూపిస్తాను. నాకు ఆసరా అవండి. మీ కష్టం అట్టే పెట్టుకోను' అంటూ మొహిరీలు మోగించాడు. వాళ్ళకు ఈ మాటలు వింతగా వినిపించాయి. తళతళా మెరిసే మొహిరీలు వాళ్ళ కళ్ళకు ఇంపుగా కన్పించాయి. అందుచేత మొహిరీలు పుచ్చుకొని అతనికి కావలసిన వస్తువులు అమ్మడం సాగించారు. కలిమహారాజు 'ఈ పథకం బాగుంది. జనం దారిలో పడ్డారు' అని సంతోషపడ్డాడు. ఇట్లాగే కొంత కాలం నడిస్తే ధనశీలుడి గతే హాలధరుడికీ పడుతుందని కులుకుతూ, నవ్వుతూ తన పని కొనసాగిస్తున్నాడు. కాని, ఆ ఆశ ఎక్కువ కాలం ఉండలేదు. ఊళ్ళో అందరికీ ఒకటో రెండో మొహిరీలు చేతికి రాగానే తృప్తిపడ్డారు. ఆ తర్వాత వారు మొహిరీలకు వస్తువులు అమ్మడం మానేశారు. తమ దగ్గర ఉన్న మొహిరీలను దారానికి కట్టి మెళ్ళో వేసుకొనే

వారు. జడలలో పువ్వులతో పెట్టుకొనేవారు. తంగేడుబిళ్ళ ఆడుకొనే వారు. మొహిరీలతో వినోదం మాత్రమే పొందేవారు. వస్తువులు ఇవ్వడం మొహిరీలు పుచ్చుకోడం ఆగిపోయింది. కలిమహారాజుకి కొందామంటే ఏవీ దొరకడంలేదు. అప్పటికి ఆయన కట్టిస్తున్న ఇల్లు సగం పూర్తి అయింది. మొండిగోడలు మిగిలాయి, ఇంటి పని ఆగిపోవడం ఒక్కటే కాదు. కలిమహారాజుకి తిండి కూడా లేదు. ఎవరూ తిండిగింజల్ని మొహిరీలకు అమ్మరు. మార్పిడిగా ఇచ్చేటందుకు అతని దగ్గర వస్తువులేవీ లేవు. మొహిరీలు చూపించి కలిమహారాజు వస్తువులు అడిగేవాడు. 'ఇవి ఎందుకు పనికివస్తాయి ? బిళ్ళపెంకుల్లాగ గలగలా చప్పుడు చేస్తున్నాయి. మా దగ్గర ఇప్పటికే కొన్ని ఉన్నాయి. అవి చాలు మా సరదా తీరేటందుకు. తినేటందుకూ, తాగేటందుకూ, కట్టేటందుకూ కొరగానివాటితో మాకేమీ పనిలేదు' అని అంతా ఈసడించేవారే. తిండిగింజలు అమ్మకపోతే పోనీ మొహిరీలు పుచ్చుకొని భోజనం పెడతారేమో అని ప్రయత్నం మొదలు పెట్టాడు పాపం కలిమహారాజు. 'వీటితో మీకేది కావలిస్తే అది కొనుక్కోండి. పని చేయించుకొని ఇది కూలిగా ఇవ్వండి' అని నచ్చచెప్పేటందుకు చూశాడు. అది ప్రజలలో ఎవరికీ నచ్చలేదు. 'మాకు బంగారంతో పనిలేదు. మేము పన్నులు కట్టనక్కరలేదు. మా దగ్గర ఎక్కువగా ఉన్న సరుకు ఇతరులకు ఇస్తాము. మాకు కావలసినవి ఇతరుల దగ్గరనుంచి తెచ్చుకొంటాము' అని వారు కచ్చితంగా చెప్పారు. కలిమహారాజుకి ఏమీ తోచలేదు. ఆకలికి తాళలేక ఒక పేదరాలు పెద్దమ్మ దగ్గరకు వెళ్ళి 'అవ్వా! నాకు ఏదైనా తినేటందుకు పెట్టు. ఒక మొహిరీ ఇస్తా' అన్నాడు. ఆమె 'అయ్యో నాయనా! నాకు మొహిరీలు ఎందుకు? ఏం చేసుకోమంటావు ? ఇప్పటికే నా దగ్గర రెండు మొహిరీలు గూట్లో పడి ఉన్నాయి. మా ఇంట్లో పిల్లాపీచూ ఎవరూ లేరు వాటితో ఆడుకొనేటందుకు. అవి ఇంకా ఎందుకు నాకు ? నాకు నీవేమీ ఇవ్వనక్కరలేదు

'అభ్యాగతిః స్వయం విష్ణుః' అన్నారు పెద్దలు. కూర్చో. కలిగింది పెడ్తిస్తా' అంది.

ఈ మాటలు వినగానే కలిమహారాజు మూరంగా పారిపోయాడు. ఎక్కడికి వెళ్ళినా ఇలాంటి మాటలే చెవిని పడసాగాయి. చివరకు ఆకలి బాధతో శోష వచ్చి సొమ్మసిల్లి పడిపోయాడు. ఆ స్థితిలో అతన్ని చూచిన పెద్దలు హాలధరుడి దగ్గరకు వెళ్ళి ఇలా అన్నారు :

'మన దేశానికి కొత్తగా ఒక సోమరిపోతు వచ్చాడు. వాడేమీ పని చెయ్యడు. 'బంగారపు మొహరీలు ఇస్తాను. అన్నం పెట్టండి. అది ఇవ్వండి, ఇది ఇవ్వండి' అని అంటూ వెంటపడతాడు. కొత్త ఒక వింత అని కొంతకాలంపాటు మనవాళ్ళు మొహరీలు పుచ్చుకొని ఆతనికి కావలసినవి ఇచ్చారు. ఇప్పుడు మానేశారు. వాడు ఆకలిచేత మాడి చచ్చేలాగున్నాడు. అలా జరిగితే మన ఊరికీ, దేశానికీ అరిష్టం. అందు చేత వాడు మాడి చావకుండా వంతులువేసుకొని వరసగా తిండి పెడితే బాగుంటుంది. ఏనాటికైనా వాడు బుద్ధిమారి బాగుపడవచ్చు. అప్పుడు వాడూ మనందరిలాగే ఏదో బతుకుతెరువు చూసుకొంటాడు' అని అన్నారు. హాలధరుడు 'బాగానే ఉంది. అలాగే చేద్దాము' అన్నాడు. వంతువారీగా కలిమహారాజు అందరి ఇళ్ళల్లో భోజనం చేస్తున్నాడు. 'ఎప్పటికైనా ఏదైనా అవకాశం దొరక్కపోతుందా ? విజయం సాధించ లేకపోతానా ?' అనే ఆశతో ఎదురుచూస్తున్నాడు. ఇలా కొంతకాలం గడిచింది. ఆనాడు ఆతని భోజనం వంతు హాలధరుడి ఇంటిలో. భోజనంవేళకు వెళ్ళి కలిమహారాజు దర్జాగా మొదటి పీటమీద కూర్చున్నాడు. తిండికి తిమ్మరాజూ, పనికి పోతురాజూవంటి వాళ్ళను చూస్తే మాధవికి పరమ అసహ్యం. వాళ్ళు పంక్తిలో అగ్రస్థానంలో కూర్చుంచే ఆమెకి

మరీ చిరాకు. పని చెయ్యని వాళ్ళ అరచేతులు మృదువుగా ఉంటాయి. చేతుల్లో ఎక్కడా కాయలుకేలి ఉండవు. కనీసం అరచేతులు మోటబారి ఉండటం కూడా జరగదు. ఈ గుర్తుల్నిబట్టి మాధవి సోమరిపోతులెవరో తేలికగా గుర్తించేది. వాళ్ళని పంక్తిలో చివర కూర్చోబెట్టి కుక్కకు పారేసినట్లుగా అన్నం పారేసేది. పంక్తిలో మొదట కూర్చునేటందుకు వచ్చిన కలిమహారాజుని శుద్ధసోమరిపోతు అని వెంటనే ఆమె గుర్తించింది. 'చివరికి పోయి కూర్చో. అదే నీకు తగిన చోటు' అని దారి చూపిస్తూ గద్దిస్తున్నట్లు ఉరమి చూసింది. కలిమహారాజు చిన్నబుచ్చుకొన్నాడు. హాలధరుడి భార్య 'మీరేమీ అనుకోకండి. మా ఇంట్లోనూ, ఈ రాజ్యం లోనూ కూడా కాయకష్టం చేసేవారికే అగ్రస్థానం. ఏ పాటూ చెయ్యని సోమరిపోతులకు కడబంతి భోజనము. ఇది మా ఇంట్లో ఆచారం. అంతే. మీమీద మాకేమీ ప్రత్యేకంగా కోపం లేదు, నిరసనా లేదు' అని వ్యంగ్యంగా చెప్పింది. కలిమహారాజు బిక్కచచ్చిపోయాడు. హాలధరుడి దగ్గరకు వెళ్ళి ఈ రీతిగా అన్నాడు: 'నీవూ, నీ రాజ్యమూ ఎన్నో శతాబ్దాలు వెనుకబడి ఉన్నారు. మీ ఆచారాలు అతి మోటుగా, అవమాన కరంగా ఉన్నాయి. ఏదైనా పని చెయ్యడానికి చేతులు ఒక్కటేనా ఉపయోగించేది? బుద్ధిమంతులు దేనితో పని చేస్తారని మీ అభిప్రాయము?' అని వెటకారంగా అడిగాడు.

'అది బుద్ధిలేని మాకు ఎలా తెలుస్తుంది? మేం అన్ని పనులూ సామాన్యంగా చేతులతోనే చేసుకొంటాము. చేతులు ఓకేవరకూ, నడుం లాగేవరకూ ఏదో చేస్తూనే ఉంటాము మరి' అన్నాడు హాలధరుడు.

'మీరంతా తెలివితక్కువ వాళ్ళు కనుకనే అలా చేస్తున్నారు. బుర్రతో పని చెయ్యడం ఎలాగో మీకు నేర్పుతాను. అప్పుడు మీకు

తెలుస్తుంది. బుర్రతో పని చెయ్యడం చేతులతో పని చెయ్యడంకంటె ఎంతో లాభసాటి అయిన పని అని' అంటూ ఎంతో ఆవేశంతో అన్నాడు కలిమహారాజు. హలధరుడు ఆశ్చర్యం వెలిబుచ్చాడు. 'అలాగా! అయితే మమ్మల్ని తెలివితక్కువ వాళ్ళని అనడంలో కొంత అర్థం ఉందన్న మాట' అని అన్నాడు. కలిమహారాజు మళ్ళీ అందుకొన్నాడు. 'బుర్రతో పని చెయ్యడం ఏమీ అంత తేలిక కాదు. నా అరచేతులలో కాయలు లేవనీ, నేను కాయకష్టం చెయ్యటంలేదనీ మీరంతా నన్ను అవమానం చేశారు. బుర్రతో పని చెయ్యడం చేతులతో పని చెయ్యడంకంటె నూరు రెట్లు ఎక్కువ కష్టం. ఒక్కొక్కప్పుడు బుర్ర పగిలిపోతుంది.'

హలధరుడు ఆలోచనలో పడ్డాడు. 'అలాగైతే ఎందుకు అంత కష్టపడటం? బుర్ర పగలగొట్టుకోకుండా హాయిగా చేతులతో చేతనైన పనులు చేసుకోవచ్చు కదా!' అని అన్నాడు.

'అదంతా మిమ్మల్ని ఉద్ధరించాలనే. మిమ్మల్ని మనుష్యుల్ని చెయ్యడము ఎలా అనే నా తాపత్రయం. నేను కృషి చెయ్యకపోతే ఎన్ని యుగాలైనా సరే మీరంతా ఇలాగే పశుప్రాయులుగా ఉండిపోతారు. నేను ఎంతో తీవ్రంగా నా బుర్ర ఉపయోగించాను. కనకనే మీరు సుఖపడటం ఎలాగో నేను బోధించగలను' అన్నాడు కలిమహారాజు.

హలధరుడి కళ్ళు మిలమిలా మెరిశాయి. 'సరే. బుర్రను ఉపయోగించి పనిచేసే ఆ విధానమేదో మాకూ బోధించు. చేతులు కొంకరలు పోయి నా నడుం నొప్పిపెట్టినా విశ్రాంతి తీసుకోకుండా బుర్ర ఉపయోగించి మేము మా పనులు కొనసాగించడానికి వీలవుతుందేమో చూస్తాము' అన్నాడు హలధరుడు.

కలిమహారాజు 'సరే' అన్నాడు. హలధరుడు తన రాజ్యం అంతటా దండోరా వేయించాడు. 'ఎవరో కుశాగ్రబుద్ధి మన దేశానికి వచ్చాడు. ఆయన బుర్ర ఉపయోగించి పని చెయ్యడం బాగా నేర్చుకొన్నవాడట. ఆ విద్య మన దేశప్రజలకు నేర్పుతాను అని అంటున్నాడు. అందువల్ల ఎక్కువ లాభం కలుగుతుందట. మీరందరూ ఒక చోట చేరి ఆ విద్య నేర్చుకోవచ్చు. నేను కూడా ఆ విద్య సంగతి ఏమిటో కనుక్కోవాలని అనుకొంటున్నాను' అనే ప్రకటన దేశం నలుమూలలకూ పంపించాడు. ప్రజలు తండోపతండాలుగా హలధరుడి ఇంటిముందు గుమికూడారు.

ఆ దేశంలో మూడు అంతస్తుల గోపురం ఒకటి ఉంది. దాని శిఖరంమీదికి వెళ్ళేటందుకు పొడుగా దానికి చుట్టూ తిరుగుడు మెట్లు ఉన్నాయి. అది పూర్వపు రాజుల విజయచిహ్నం. విజయోత్సవాలూ, సైనిక వందనాల స్వీకారమూ అక్కడే జరిగేవి. హలధరుడి పాలనలో అన్ని ఆడంబరాలతోపాటు అవీ వెనక్కు వెళ్ళాయి. అందుచేత దానికి పూజాపునస్కారాలు లేవు. బాగా బూజుపట్టి ఉంది. హలధరుడు కలి మహారాజును ఆ గోపురంమీదికి తీసుకొనివెళ్ళాడు.

'ఇక్కడ నిలబడి ప్రజలందరికీ ఆ బుర్రను ఉపయోగించే విధానం ఏదో బోధించు. అందరికీ వినిపిస్తుంది. నీవు అందరికీ కనిపిస్తావు కూడా' అని చెప్పాడు.

తర్వాత హలధరుడు తాను కూడా ప్రజలతోపాటు అతను చెప్పేది విందామనీ, చేసే పని చూద్దామనీ వారితో కలిసి పరిశీలిస్తున్నాడు.

కలిమహారాజు గొంతుక సర్దుకొన్నాడు. మేఘగంభీర స్వరంతో ఉపన్యాసం మొదలుపెట్టాడు. ఎంతసేపు చెప్పినా పని చెయ్యకుండా జీవించే విధానాలను గురించే చెప్పసాగాడు. అమ్మడం, కొనడం, లాభం,

నష్టం, పక్షీ, ప్రకటనా, ప్రచారమూ, వాటి శక్తీ మొదలైనవి వివరించ సాగాడు. యుక్తిపై యుక్తులు పన్ని ఒకరి పాటుయొక్క ఫలితాన్ని మరొకరు పొందడం ఎలా వీలవుతుందో వివరించాడు. ఎంతసేపు చెప్పినా అదే గొడవ. మనిషి పని చెయ్యకుండా అతను చేసే ప్రతి పనీ చెయ్య గలిగిన యంత్రసాధనాల సృష్టి, అది ఇతర దేశాలలో ఎంత పోటా పోటీగా సాగుతున్నదో వివరించాడు ఏ పెట్టుబడీ లేకుండా చెయ్యడానికి వీలైన కమీషను, దళారీ వ్యాపారాలూ, లాటరీలూ, జూదాలూ, నాటకాలూ మొదలైన కార్యక్రమాలూ, వాటివల్ల ఏయే దేశాల్లో ఎందరెందరు త్వరగా లక్షాధికారులు, కోటీశ్వరులు అయినదీ ఉదాహరణలతో ఉపదేశిం చాడు. ఈ రీతిగా కలిమహారాజు ఉపన్యాసం సాగుతోంది. గంటలు గడిచాయి. పొద్దు పడమటికి మళ్ళింది. పోగుపడిన జనానికి ఆశాభంగము కలిగింది.

'ఈయన బుర్రతో పని చెయ్యడం ఎలాగో చూపిస్తాడను కొన్నాము. ఏమిటీ ఈ ఊకదంపు ఉపన్యాసం? ఎంతసేపు విన్నా ఒకటే ధోరణిలో సాగుతోంది. మనకు దీనివల్ల ఏమీ ప్రయోజనం లేదు. పోయి మన పనులు మనం చూసుకుందాం' అని గుసగుసలుగా చెప్పు కొన్నారు. ఒక్కరొక్కరే అక్కడినుంచి జారుకున్నారు.

హాలధరుడు కూడా తన పనులు చూసుకొనేటందుకు బైలుదేరాడు. వెడుతూ ఇద్దరు ముగ్గురు కుర్రవాళ్ళను వంతువారీగా కాపలా ఉండ మన్నాడు. 'ఈ కొత్తగా వచ్చిన బుద్ధిమంతుడు బుర్రతో పని చెయ్యడం మొదలుపెట్టగానే పరుగుత్తుకొనివచ్చి నాతో చెప్పండి. నేను వచ్చి అదేమిటో చూస్తాను' అన్నాడు.

కలిమహారాజు రోజల్లా మాట్లాడాడు. రెండో రోజూ, మూడో రోజూ కూడా గడిచాయి. ఉపన్యాసం పూర్తికాలేదు. 'అతనికి దాహం

అవుతోందేమో, ఈ మంచినీరు ఇద్దాము. ఆకలి అవుతోందేమో, ఈ పదార్థాలు తినమని ఇద్దాము' అని అనుకొన్నవాళ్ళే లేరు.

'బుర్రతో పనిచేస్తున్న అతను అతని తిండి సంగతి అతనే చూసుకొంటాడు. మన పూచీ తప్పింది. వంతువారీగా భోజనానికి పిలవనక్కరలేదు' అని అనుకొన్నట్లున్నారా ప్రజలు. అందుచేత ఎవరూ ఆ సంగతి గురించి పట్టించుకోలేదు.

కలిమహారాజుకి దప్పిక అయింది. ఆకలి వేసింది. కాని ఉపన్యాసం ఆపలేదు. నీరసంవల్ల ఆయన కళ్ళు చీకట్లు కమ్మాయి. గోపురం దగ్గర నుంచి దారే పోతూ వచ్చిన జనాన్ని అప్పుడప్పుడు హలధరుడు ఇట్లా అడుగుతూ ఉన్నాడు. 'ఆ బుద్ధిమంతుడు బుర్ర ఉపయోగించి పని చెయ్యడం మొదలుపెట్టాడా ?' వారు కూడా 'లేదు. ఇంకా వాడు ఏదో పిచ్చిపిచ్చిగా అట్లాగే వాగుతూ ఉన్నాడు. పని ఏమీ చెయ్యడంలేదు. వాడి వాగుడు మాకేమీ తెలియడంలేదు' అని చెప్పడమే జరిగింది ఆ మూడు రోజులూ.

కలిమహారాజుకి నిస్త్రాణ వచ్చింది. కాళ్ళల్లో క్రమంగా సత్తువ తగ్గింది. తూలిపోసాగాడు. పట్టు తప్పి కింద పడ్డాడు. ఆ పాటుకి అతని తలకి దెబ్బ తగిలింది. వెంటనే స్మృతి తప్పింది. కలిమహారాజు వరసగా ఒక మెట్టుమీదనుంచి దాని కింది మెట్టుమీదికి దభీమంటూ దొర్లి పడటం మొదలుపెట్టాడు. అది చూసి కాపలా ఉన్న కుర్రనాగమ్మలు హలధరుడి దగరకు పరుగెత్తుకొని వెళ్ళారు. వగర్చుకొంటూ 'ఆ బుద్ధిమంతుడు బుర్రతో పని చెయ్యడం మొదలుపెట్టాడు' అని చెప్పారు. హలధరుడు వెంటనే 'ఆలాగా' అని ఉన్నవాడు ఉన్నట్లుగానే గోపురం దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళాడు. అతని వెంట అతని భార్య, వారిని చూసిన జనమూ గోపురం దగ్గరకు పరుగెత్తారు. అప్పటికే కలిమహారాజు తల

ఒక్కొక్క మెట్టుతో ఒక్కొక్కసారి డీడిక్కొలు కొట్టి కిందికి చేరింది. సమ్మెట దెబ్బలు తగిలినట్లయి తల పగిలింది. స్మృతి తప్పి రక్తం ఓడుతూ కలిమహారాజు భూపతనం చెందాడు. అతన్ని చూసి హలధరుడు జాలిపడ్డాడు. 'పాపం ఏదో మాటసామెతగా అన్నాడనుకొన్నా. కాని, ఇతను అక్షరాలా నిజమే చెప్పాడు. బుర్రసి ఉపయోగించి పనిచేస్తే బుర్ర పగిలిపోతుందని అన్నాడు. పాపం ఇంతకీ ఎంతపని చేశాడో ఏం చేశాడో తెలియలేదు. భగవంతుడి అనుగ్రహంవల్ల ఈ నాడు ముక్తి కలిగింది' కొనఊపిరితో ఉన్న కలిమహారాజు చెవిలో ఈ మాటలు పడ్డాయి. తన అనుచరులమాదిరిగా అతనూ పాతాళలోకంలోకి దూసుకొని వెళ్ళిపోయాడు. అక్కడ ఒక సొరంగం మిగిలింది.

హలధరుడు ఏమీ తోచక బుర్ర గోక్కున్నాడు, 'వీడు వాళ్ళందరికీ నాయకుడు కాబోలు. ఎన్ని ఎత్తులువేశాడు. ఎంతకాలం తంటాలు పడ్డాడు. ఎన్ని లయలమారి కబుర్లు చెప్పాడు. నన్ను మోసంచేసి బురదలోకి లాగాలని చూశాడు. భగవంతుడు ప్రసాదించిన కర్మేంద్రియాలను మూలకునెట్టి మరొకరిపాటుకోసం ఆశపడి కుయుక్తుల్తో, దొంగబుద్ధితో జ్ఞానేంద్రియాలను తప్పుదారి పట్టించి బ్రతికే బ్రతుకు ఏం బ్రతుకు? ఛీ! మాకు ఈ రకం మనుష్యులపీడ ఎన్నటికీ వద్దు. అని భగవంతుడి దయవల్ల తప్పిపోయింది' అని సర్వేశ్వరుడికి మోకరించి నమస్కరించాడు. తన ధర్మవిజయ సూచకగా ఆ గోపురశిఖరంమీద అఖండదీపాన్ని ప్రతిష్ఠించాడు.

హలధరుడూ అతని అనుయాయులూ సుఖంగా ఉన్నారు. వారెప్పటికీ అట్లాగే ఉంటారు. హలధరుడే ఆ దేశంలో రాజు. అతను కిరీటం ధరించడు. ప్రజలమీద పన్నులు వెయ్యడు. అతనికి సైన్యంలేదు. దానితో పనిలేదు. అతని ప్రజలలో అందరూ స్వతంత్రులే. అందరూ సమానులే. అందరూ నిత్యసంతోషులే. ఆ దేశంలో వెలిగిన జ్ఞానజ్యోతి, కాంతి వెదజల్లుతూ అన్నిదేశాలవారికీ దారి చూపిస్తోంది.

ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః

